# దేశం ఏమైంది!

[ — నవల — ]

ఎలన్ పేటన్

అనువాదం:

రెంటాల గోపాలకృష్ణ

దేశి కవితా మండలి
విజయవాడ - 2

# పరిచయం

దక్షిణ భాషా పుస్తక సంస్థవారు ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథ సంచయములోని తొలి ప్రచురణ లివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం నాలుగు దక్షిణాది భాషలలో విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహదమిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింప చేయాలనే సత్సం కల్పంతో, సముదార దూరదృష్టితో ఫోర్డు ధర్మనిధివారు ఈసంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణదేశంలో ఉన్న ఏడు విశ్వ విద్యాల యాల ఉపాధ్యాయులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి మంచి పుస్తకాలను, ప్రచురణ కర్తలచే అందంగా అచ్చు వేయించి అందరికి అందుబాటులో ఉండే సరసమైన ధరలకు అందచేయా లనే ఆదర్శంతో మూడేళ్ళ కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషి వలన మనకు లభించిన ప్రథమ ఫలా లివి. కీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢ శైలిలో ఉండే విద్వత్కావ్యాల జోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన, ఆంగ్ల భాషావాసనలేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకాన్ని అలరించి, ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికా సాన్ని పూర్తిగ అందించగల సులభ సుందర శైలిలోఉన్న ఉత్తమ గ్రంథా లను మాత్రమే ఎన్నుకున్నారు.

ఉన్నత సారస్వత శ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలనూ కూడా ప్రచురింప చేయడం వీరి ప్రధాన లక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం అనేది దక్షిణభాషా పుస్తక సంస్థవారి పరమాశయం. ఇందులో వీరెంత వరకు కృతకృత్యులైనదీ ఇప్పడీ గ్రంథాలను బట్టి ప్రజలే నిర్ణయించవలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషి ఫలితం బహుశా వచ్చే పదిసంవత్స రాల వరకు అంతగా కనబడక పోవచ్చు. కాని ఈప్రణాళిక అద్భుతమైనదని, అత్యంత ప్రధానమైనదని మాత్రం దూరదృష్టి గల వారందరూ ఒప్పుకోవక

తప్పదు. ఇందుకుగల అవకాశాలు అనేకం. అందమైన అచ్చుతో చౌకగా అందరికీ అందుబాటులో ఉండే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారు మూల కుగ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు కొత్త వెలుగునీ, విజ్ఞానాన్నీ అందించగలవు.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి కార్యక్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం – నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండడం వింతకాదు. ప్రాచీనకాలంలో వింధ్యకు దక్షిణాన ఉండే దేశమంతా దక్షిణా పథమనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృతికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈ నాలుగు భాషలనూ వాటి ప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుకచేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకే కోవకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాషలనడం నా అభిమతం కాదు. ఈ రోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషా పరమైన దిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నా యీ సంకోచానికి కారణం. ఈ నాలుగు భాషలకు మధ్య సహజమైన సన్నిహిత సంబంధాలు చాలా ఉన్నవి. పైగా ఆర్యావర్తంలో వ్యాప్తిలో ఉన్న సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్ప సంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహం వల్ల ప్రచురితమయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థాన భాషా వేషానురతి శ్రుతి మించిపోకుండా సమగ్ర భారత సంస్కృతిని ప్రతిబింబింప జేసే పుస్తకాలను విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, ప్రపంచ కళ్యాణాన్ని కాంక్షించే ఉత్తమ గ్రంథాలు అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

—పా. వెం. రాజమన్నారు.

# ఈ నవలను గురించి....

గడచిన దశాబ్దంలో వచ్చిన ఉత్తమ నవలలో ఇది ఒకటి. ఇందలి విషయమూ, శైలీ ఎంతో విశిష్టంగా ఉన్నాయి. సరళితకు ఇది ఒక చక్కని ఉదాహరణ. శిల్పనైపుణ్యమూ, దాంతోపాటు తన నిజాయితీని నిష్కాపట్యాన్ని మరింత అద్భుతంగా ప్రదర్శించి పాఠకుని హృదయంలో హత్తుకు పోయేటట్లు రచన చేశాడు ఈ రచయిత.

పాతకాలపునాటిదే ఈ నవలలో కథ—భక్తిశ్రద్ధలుకల తండ్రికీ, తప్పుదారిలో పడిన చిన్నారి కుమారుడికీ సంబంధించిన కథ ఇది. తండ్రి జూలూ జాతికి చెందిన ఒక మతగురువు. వృద్ధుడు. ఎంతో నమ్రత కలవాడు. దక్షిణాఫ్రికాలో ఇక్‌సోపోపైన కొండల ప్రాంతంలో ఆయన నివాసం. తన స్వస్థలంనుంచి కాలు బయటపెట్టి ఎరగడాయన. అలాంటివాడు తన ఒక్కగాన ఒక్క కుమారుణ్ణి వెదకడంకోసం జోహాన్సుబర్గు వెళ్ళ సాహసించాడు. 'పాపాలకూ, శాపాలకూ పెట్టినపేరు' ఆ నగరం. ఏం కీడుమూడుతుందో అని భయపడుతూనే వెళ్ళాడు అక్కడికి. అవును మరి. కొడుకు ఇల్లువదిలి వెళ్ళి ఎన్నో నెలలయింది. ఎక్కడున్నాడో, ఏమైనాడో జాడా జవాబూ లేదు. ఆదిమవాసులయిన యువకు లనేక మందిని—అవినీతికీ, అపరాధానికీ, ఆఖరుకు సర్వనాశనానికీ ఒడికట్టేటట్లు చేసింది ఆ మహానగరం. ఆ విషయం ఆయనకు బాగా తెలుసును. అందుకే వెళ్ళాడు అక్కడికి.

తీవ్రమైన బాధలకు లోనవుతూ, దీర్ఘకాలం నగరమంతా గాలించాడు ఆ మతగురువు. అనేక మర్మాలు తెలుసుకున్నాడు. అడుగడుగునా ఒక గండం ఎదుర్కొన్నాడు. నగరం పూర్తిగా కొత్త. అక్కడాయన్ని ఎవ్వరూ ఎరుగరు. అయినా కొద్దిమంది నమ్మకమైన మిత్రులు ఆయనకు దొరికారు. వారి సహాయంతో తప్పిపోయి, తప్పుత్రోవ పట్టిన కుమారుడి కోసం వెదికాడు. క్రమక్రమంగా అతని దుస్సాంగత్యాలూ, దుర్మార్గాలూ, దుర్నడతలూ, నేరాలూ, ఘోరాలూ కనుగొన్నాడు. తుదకు ఆ అబ్బాయి

'పిల్లలజైలు'లో ఉన్నాడని తెలుసుకుని అక్కడికి వెళ్ళాడు. కాని అదే
తరుణంలో ఆ అబ్బాయి పిల్లలజైలునుంచి విడుదల చేయబడ్డాడు; దురదృష్ట
వశాత్తూ, అతని మంచికోసమే, అంత త్వరలో విడుదలయినాడు. చిట్టచివ
రకు కొడుకు కారాగారంలో ఉండగా కలుసుకున్నాడు తండ్రి. ఆ కుర్ర
వాడు ఒక ఐరోపా దేశస్థుణ్ణి హత్యచేశాడు. అందువల్ల జైలు ప్రాప్తించింది
అతనికి. ఆ ఐరోపాదేశస్థుడు ఒక ఆంగ్లేయుని కుమారుడు. జూలూ మత
గురువు స్వస్థలమైనలోయకు చాలా చేరువగానే ఆయనకు పెద్దపెద్దపొలాలు,
తోటలు, గొడ్లు ఉన్నాయి. దక్షిణాఫ్రికాలోని నల్లజాతులకు న్యాయం
కలిగించడంకోసం ఆ ఆంగ్లేయుడు తన జీవితం యావత్తూ ధారపోశాడు.
న్యాయం ఎలాంటి అనివార్యమైన పద్ధతి అవలంబించినప్పటికీ, చెరొకవిధంగా
తమ కుమాళ్ళను కోల్పోయిన ఆ తండ్రుల ఇరువురి హృదయాలూ మహో
న్నతమైనవి. వారిరువురూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు. ఒకరిపై
ఒకరు కరుణచూపుకున్నారు. కడకు ఒకరినొకరు క్షమించుకున్నారు
కూడా. ఈ ఆర్ద్రత ఒక్కటే ఆ ఇరువురు తండ్రుల గుండెలలో మండే
గాయాలను మాన్పకల్గింది. నవల రెండవ సగభాగంలో ఈ కథ వర్ణిత
మైంది. మానవస్వభావాన్ని అనిర్వచనీయంగాను, అత్యద్భుతంగాను చిత్రిస్తూ
విషాదాంతంలో మహోన్నత శిఖరాలను అందుకున్నది ఈ నవల కడపటి
భాగం.

శైలికీ, కథా నిర్మాణానికీ అత్యద్భుతమైన తార్కాణం ఈ నవల.
ఇందలి కథావిధానం ఎప్పటికప్పుడు కదులుతూ, మనలను కదిలిస్తూ పోయి
పోయి పరాకాష్ఠ నందుకుంటుంది. ఇందులోని కథాగమనం రెండు సగా
లుగా విడివడి ఉంది. మొదటి సగభాగం మనస్సు వికలమైన తండ్రి,
తప్పిపోయిన కొడుకును వెదకడాన్ని గురించి చెబుతుంది. సామాజిక ఆవర
ణాన్ని అంటుకునిఉన్న ఒక చిత్రాన్ని—దక్షిణాఫ్రికా తమ స్వంతమని
సత్య ప్రతిపాదనచేస్తూ; అనుమానం, పగ, ద్వేషం—వీటివలన రెండు ముఖా
లుగా చీలిపోయిన ప్రజలతాలూకు చిత్ర పటాన్ని తీర్చి దిద్ది మనకు చూపు

తుంది. ఈ వాతావరణం అప్పుడప్పుడు, తెలుపు నలుపు జాతులమధ్య చక్కటి సామరస్యాన్నీ సుహృద్భావాన్నీ సృజించడంకోసం యత్నిస్తూ తిరిగే పెద్ద పెట్టున పోరాటాలు సాగిస్తూ అన్ని వేళలా విజయంపొందని ఇరుపక్షాల తాలూకు స్త్రీ పురుషుల ధోరణులవల్ల, చర్యలవల్ల ఉజ్వలిత మవుతూ వచ్చింది. అంతేకాదు; మహానగరమైన జోహాన్సుబర్గ్ జీవితాన్ని గురించి, తమ సాటి మానవులను ఆహుతిచేసి తద్వారా ఐశ్వర్యాన్ని, అధికారాన్ని చేపట్టచూచే అక్కడి ప్రజలనుగురించి కూడా ఈ నవల తొలి సగభాగం చెబుతుంది మనకు. ఆకలితో, పేదరికంతో కృశించిపోతూ ఎక్కడో దిక్కూ—మొక్కూ లేకుండా పడిఉన్న జూలూ మత గురువు స్వస్థలమైన లోయలోని ప్రజా జీవితానికీ, తక్కిన విశాల ప్రపంచానికి మధ్యగల వైవిధ్యాన్ని రచయిత అడుగడుగునా రూపుకట్టి చూపుతాడు. గ్రంథంలోని ఈ తొలిభాగం ఒక కథ చెపుతూ, సంఘటనలను వివరిస్తూ పోగా, నవలలోని రెండవ సగభాగం మానవాత్మతాలూకు ఒకానొక అగాధమైన అనుభూతి పేర్కొంటుంది. సుందరమైన, విషాదభరితమైన దక్షిణాఫ్రికాదేశం ఒక్క దానికి మాత్రమే సంబంధించికాక, యావత్ప్రపంచానికీ చెందిన మానవ సంబంధాలను మలిచి మనముందు పెట్టడం జరుగుతుంది, ఈ భాగంలో. అందువల్లనే ఈ నవలకు ఒక విశ్వజనీనత సిద్ధించింది. జూలూ మతగురువు తిరిగీ తన స్వగృహానికి వెళ్ళి అక్కడ హత్య చేయబడిన వ్యక్తి తండ్రిని కలుసుకున్నప్పుడు, మానవహృదయాన్ని తను ఎంత లోతుగా అర్థంచేసుకున్నదీ, దాన్ని తను ఎంత ఘనంగా వ్యక్తీకరిస్తున్నదీ స్పష్ట పరుస్తాడు రచయిత.

మానవుడి ఉద్వేగాలను చల్లార్చి, అతని మనస్సు ఒక మహోన్నత స్థితిలోఉండేటట్లు చేయడం, మానవాత్మ ఎంతటి అనర్థాన్నయినాసరే జయించి తీరుతుందని గ్రహించేటట్లు చేయడం—ఇదే ఉత్తమ విషాదాంత రచనల లక్షణం అని అరిస్టాటిల్ వంటి పండితులు పేర్కొన్నారు. ఆ తీరుగా నడిచింది ఈ గ్రంథం చివరిభాగం. అంతేకాదు, శైలిలో తనకు గల ప్రావీ

ణ్యతను పరిపూర్ణంగా కనపరిచాడు రచయిత. ఈ భాగంలో చెప్పవలసిన విషయాన్ని స్పష్టంగా చెప్పడంకంటె, సూచన ప్రాయంగానూ, అన్యాప దేశంగానూ, ముద్దుముద్దు మాటలతో ముక్తసరిగా చెప్పి ఊరుకుంటాడు. అది మనలను ముగ్ధుల్ని చేస్తుంది. మానవ హృదయాలను ఉత్సూత లూగిస్తుంది.

ఈ నవలలో పలువిధాలయిన పాత్రలు మనముందు నిలుస్తుంటాయి. జ్ఞానులు మతగురువు మొదలు, హత్య గావించబడిన వ్యక్తి చిన్నారికుమారుడు దాకా ఎన్నో పాత్రలు. ఆ పసివాడి చురుకుదనం, మానవుడు మానవుడికి తోడ్పడాలనే సత్యాన్ని, ఆ చిన్నవాడు తనకు తెలీకుండానే ఆచరణలో పెట్టడం, నోరెత్తి మాట్లాడని మతగురువు భార్య లగాయతూ, ఆ సు కుమా రుడి వల్ల చెడగొట్టబడిన అమ్మాయి వరకూ—ఎన్నెన్నో మన కళ్ళముందు కనుపిస్తాయి. సర్వనాశనమైపోయిన ఉమ్మడికుటుంబాలూ లోయ మొదలు, మహానగరమైన జోహాన్సుబర్గుదాకా ఎన్నెన్నో రంగు రంగుల దృశ్యాలు రకరకాల మనోద్వేగాలు మనం ఈ నవలలో చూస్తాం. ఇవన్నీ మానవ హృదయంలోని ప్రతి తంత్రినీ తాకి, మధురంగా మోగిస్తాయి. ఈ గ్రంథంలోని అసత్యమైన విషయం ఒక్కటీలేదు. రచయిత తన దృఢసంకల్పం తోనూ తన మాతృభూమిలో అలుముకున్న విషాదాన్ని అంతంచేయా లనే తీవ్ర ఆకాంక్షతోనూ, తన జాతిలో ఆవరించిన అశాంతి అల్లకల్లోలం పగ, వగ, అవగతం కావాలన్న దృష్టితోనూ ఈ గ్రంథం రచించాడు.

—ప్రొఫెసర్, మిసెస్. జి. పార్థసారధి.

# దేశం ఏమైంది!

## ప్రథమ కాండ:

౧

ఇక్సోపోనుంచి ఒక చక్కని రస్తా కొండల్లోకి వెడు తోంది. ఈ కొండలు పచ్చికతో నిండి దొంతులు దొంతులుగా ఉన్నాయి. వీటి అందచందాలను కొనియాడడం అలవి కాని పని. కొండల్లో ఏడుమైళ్ళ పొడుగున – కారిస్ బ్రూక్ దాకా ఈ త్రోవ ఉంది. అక్కణ్ణుంచి పొగమంచు లేనప్పుడు దిగువకు చూస్తే ఆఫ్రికాలోని అతిసుందరమైన లోయల్లో ఒకటి మీకు అగుపిస్తుంది. మీ చుట్టూ పచ్చిక, అడవి మొక్కలు కనపిస్తాయి. పచ్చిక భూముల్లో విహరించే టిటిహోయా పక్షి ఏకాకిగా చేసే విషాదగానం మీకు వినిపిస్తుంది. మీకు క్రిందివైపున డ్రాకెన్సుబర్గునుంచి సముద్రం వరకూ విస్తరించిన ఉమ్‌జిమ్ కూలూ నదీలోయ ఉంది. నదికి ఆవలి ప్రక్క ఈవలి ప్రక్క వరుసలు తీరిన ఉన్నత పర్వత శ్రేణులు; వాటికి అవతల ఇవతల ఇంగేలీ, తూర్పు గ్రిక్వాలాండ్ పర్వతాలు ఉన్నాయి.

అక్కడ పచ్చిక సమృద్ధిగా పెరిగి జడలు జడలుగా పెనవేసుకుని ఉంది. చూద్దామన్నా మీకు నేల కనిపించదు.

అక్కడ కావలసినంత వాన కురుస్తుంది. పొగమంచు పడుతుంది. ఆ నీరంతా ధారకట్టి నేలలోకి దిగుతుంది. ప్రతి కొండ పగులులోగుండా జాలువారి వాగులను పుష్కలంగా నింపుతుంది. జాగ్రత్తగా పోషితమైన పచ్చిక అది. అక్కడ విచ్చలవిడిగా పశువులు మేయలేదు. కటిక నేలగా చేసే యే అగ్ని దాన్ని దహించలేదు. పాదరక్షలు లేకుండా ఆ పచ్చిక బీడుపై నిలవబడండి. ఎంచేతనంటే అది పుణ్యభూమి. ఆ సృష్టికర్త అనుగ్రహించిన భూమి అది. దాన్ని పోషించుకోండి, దాన్ని కాపాడుకోండి, దాన్ని పదిలంగా భద్రపరుచుకోండి. అందుకు బదులుగా అది మానవులను పోషిస్తుంది, మానవులను కాపాడుతుంది, మానవులను జాగ్రత్తగా రక్షిస్తుంది. దాన్ని ధ్వంసంచేశారా, మానవుడు ధ్వంసమై పోతాడు.

మీరు నిలుచున్నచోట పచ్చిక సమృద్ధిగా, చిక్కగా అల్లుకుని ఉంటుంది. చూద్దామన్నా మీకు నేల కనిపించదు. కాని పచ్చని ఆ ఉన్నతపర్వతాలు విరిగి క్రిందికి దిగుతాయి. దిగువనున్న లోయలోకి వాలుతాయి. అలా వాలి వాలి తమ ప్రకృతి ధర్మాన్నే కోల్పోతాయి. అంచేతనే అవి మెర్రగా మారి శూన్యంగా ఉండిపోయాయి. వాటిపై వాన కురవదు. మంచుజల్లులు పడవు. కొండచరియల్లోను, వాగుల్లోను చుక్క నీరుండదు. పశువులు పచ్చికపైబడి విచ్చలవిడిగా మేసి పోతుంటాయి. ఎన్నినోళ్ళ మంటలకు మాడిపోయిందా నేల. కనుకనే పాదరక్షలు వేసుకుని అక్కడ నిలుచోండి. లేకపోతే గరుగ్గాను, పదునుగాను ఉన్న నేల,

కోసుగా ఉన్న రాళ్ళు మీ పాదాలకు కోసుకుంటాయి. పోషించుకొని, కాపాడుకొని, పదిలంగా భద్రపరుచుకోని భూమి అది. అంచేతనే ఇహ అది మానవులను పోషించదు. మానవులను కాపాడదు, మానవులను జాగ్రత్తగా రక్షించదు. ఇహమీదట అక్కడ టిటిహోయాపక్షి కూత వినిపించదు.

ఈ ఎర్రకొండలు – ఈ మహానగరాలు నిర్జీవంగా నిలిచిపోయాయి. కండచీల్చినట్లు వీటినుంచి భూదేవి విడిపోయింది. వీటిమీద మెరుపులు తళుక్కుమని మెరుస్తాయి. మేఘాలు కుంభవృష్టి కురిపిస్తాయి. ఎండిన ఏరులన్నీ ఒక్కమాటుగా సజీవమై, పుడమినుంచి కొత్తరక్తం పుంజుకుని గల గల ప్రవహిస్తాయి. దిగువనున్న లోయల్లో స్త్రీలు శేషించిన భూమిని దున్ని సాగుచేశారు. జొన్నపైరు మనిషెత్తు పెరగడమంటే మహాకష్టం. వృద్ధులు, వృద్ధురాండ్రు, తల్లులు, పిల్లలు; వీరందరి లోయ లవి. పురుషులు తరలిపోయారు, వయసు కుర్రాళ్లు, పడుచుపిల్లలు వెళ్ళిపోయారు. ఇహ ఈ భూమి వారిని పోషించలేకపోయింది.

## ౨

ఆ చిన్నపిల్ల ఉత్తరం చేతపట్టుకుని జరూరుగా చర్చికి పరుగెత్తింది. కలప, ఇనుము కలిపి కట్టిన చర్చి అది. చర్చి ప్రక్కనే ఉన్న ఒక ఇంటిదగ్గరికి వెళ్ళి ఆ అమ్మాయి జంకుతూ తలుపుతట్టింది. టేబిల్ దగ్గర వ్రాసుకుంటున్న రెవరెండ్ స్టీఫెన్ కుమాలో కన్నెత్తి చూచాడు. లోపలికి రమ్మని పిలిచాడు.

ఆ చిన్నారి తలుపు తెరిచింది. ఇంటికి తలుపెంతో ముఖ్యమైనట్లు, గట్టిగా నెడితే యెక్కడ పాడయిపోతుందో అని భయపడుతున్నట్లు భద్రంగా తీసింది. బెదిరి బెదిరిపోతూ లోపల అడుగుపెట్టింది.

"ఉత్తరం తెచ్చాను, * ఉమ్ఫున్‌డీస్" అన్నది.

"ఉత్తరమా? ఎక్కణ్ణుంచి తెచ్చావు నా చిట్టితల్లీ?"

"స్టోర్‌నుంచి తెచ్చాను ఉమ్ఫున్‌డీస్. ఆ తెల్లజాతి మనిషి మీా కివ్వమని చెప్పి నా కిచ్చాడిద."

"నీవెంతో మంచిదానివమ్మా. సరే, వెళ్లు చిట్టితల్లీ."

కాని ఆ పిల్ల వెంటనే వెళ్ళలేదు. వట్టిపాదా లాపిల్లవి. ఒక పాదం మరొకపాదానికేసి రుద్దుకుంది. ఒక చేతివ్రేలితో ఉమ్ఫున్‌డీస్ టేబిల్ అంచుపొడుగునా రాస్తూ నిలుచుంది.

"నీకు ఆకలిఅవుతోందికాబోలు చిన్నారీ" అన్నాడాయన.

"అంతగా ఆకలి లేదు ఉమ్ఫున్‌డీస్"

"అయితే కొంచెం ఆకలవుతోంది."

"అవును. కాస్త ఆకలవుతోంది ఉమ్ఫున్‌డీస్."

"అయితే అమ్మదగ్గరికి వెళ్ళమ్మా. ఏదో కాస్త తినడానికి పెడుతుంది."

"నమస్కారం ఉమ్ఫున్‌డీస్."

* గౌరవమైన సంబోధన.

ఆ పిల్ల సుతిమెత్తనగా నడుస్తూ వెళ్ళింది. అంత పెద్ద ఇల్లు. అక్కడ కుర్చీలు బల్లలు ఉన్నాయి. ఒక గడియారం ఉంది. పూలకుండీలో ఒక పూలమొక్క ఉంది. బోలెడు పుస్తకాలు కూడా ఉన్నాయి. బడిలోఉన్న పుస్తకాలకంటె కూడా యెక్కువ పుస్తకాలు. అలాంటి ఇంట్లో నడుస్తోంటే తన పాదాలు ఏ హాని తెచ్చిపెడతాయో అన్నట్లు సున్నితంగా అడుగులువేస్తూ వెళ్ళింది.

కుమాలో ఉత్తరం చూచాడు. అది మురికిగా ఉంది. ముఖ్యంగా ముద్ర వేసినచోట. అది ఎందరి చేతుల్లోనో తిరిగింది. సందేహం లేదు. అది జోహానసుబర్గు నుంచి వచ్చింది. ఇప్పుడు జోహానసుబర్గులో అతనికి కావలసినవారు అనేక మంది ఉన్నారు. అతని సోదరుడు జాన్ వడ్రంగం పని చేస్తాడు. అతను జోహానసుబర్గు వెళ్ళాడు. జోహానసుబర్గు లోని సోఫియా టౌన్‌లో స్వంత వ్యాపారం పెట్టుకున్నాడు. అతని చెల్లెలు గెర్ట్రూడ్ అతనికంటె పాతికేండ్లు చిన్న. ఆవిడ తన పసిపిల్లవాణ్ణి తీసుకుని భర్తను చూడడానికై వెళ్ళింది. గనులనుంచి మళ్ళీ ఇంతమటుకూ తిరిగిరాలేదు. అతని కొక్కడే కొడుకు అబ్‌సాలమ్. అత్త గెర్ట్రూడ్‌ను చూడడానికని అక్కడికివెళ్ళి మళ్ళీ తిరిగిరాలేదు. వీరే కాదు. వీరంత దగ్గరివారు కాకపోయినప్పటికీ ఇంకా అనేకమంది చుట్టాలు అక్కడే ఉన్నారు. మరి ఈ ఉత్తరం ఎవరిదగ్గర నుంచి వచ్చిందో చెప్పడం కష్టం. ఎంచేతనంటే వెళ్ళి ఇంత కాలమైనా వీరిలో యెవరూ ఒక్క ఉత్తరముక్క వ్రాసిన పాపాన పోలేదు. వారి దస్తూరికూడా సరిగ్గా జ్ఞాపకంలేదు.

అతను ఉత్తరం తిప్పి చూశాడు. కాని అది యెవరి దగ్గరనుంచి వచ్చిందీ దానిమీద లేదు. దాన్ని తెరవడానికి అతనికి మనస్కరించడంలేదు. ఒకమాటు అది తెరిచినతరువాత మళ్ళీ అతికించడం కుదరదని అతనికి తెలుసును.

అతను భార్యను పిలిచాడు: "ఆపిల్ల వెళ్ళిపోయిందా?"

"తింటోంది స్టీఫెన్."

"అయితే తిననీయి. ఆ పిల్ల ఒక ఉత్తరం తెచ్చింది. ఉత్తరంసంగతి నీకేమైనా తెలుసునా?"

"నాకెలా తెలుస్తుంది స్టీఫెన్?"

"కాదు. నాకది తెలియడంలేదు. ఒకమాటు ఇది చూడు"

ఆవిడ ఆ ఉత్తరం తీసుకుని తడిమిచూచింది. కాని అలా తడిమిచూచినంత మాత్రాన అది ఎవరిదగ్గరనుంచి వచ్చి ఉంటుందో ఆవిడ కర్థమైంది కాదు. నింపాదిగా జాగ్రత్తగా 'ఉత్తరం మీది' అని విలాసం చదివింది.

రెవరెండ్ స్టీఫెన్ కుమాలో,
సెయింట్ మార్క్ చర్చి
ఇన్‌డాట్‌షేనీ, నేటాల్.

ఆవిడ తన ధైర్యాన్నంతా చిక్కబట్టుకుని అన్నది:

"ఇది మన కుమారుడి దగ్గరనుంచి వచ్చిందికాదు."

"కాదు" అన్నాడతను. ఇలా అని నిశ్వసించాడు. "ఇది మనఅబ్బాయి వ్రాసిందికాదు"

"బహుశా వాడికి సంబంధించింది అయిఉంటుంది" అన్నదావిడ.

"అవును." అన్నాడతను: "అదే కావచ్చు"

"ఇది గెర్ట్రూడ్ దగ్గరనుంచి రాలేదు" అన్నదావిడ.

"బహుశా నా తమ్ముడు జాన్ వ్రాసిఉంటాడు."

"జాన్ వ్రాసిందికాదు." అన్నదావిడ.

వారిద్దరూ మౌనం వహించారు. తరువాత ఆవిడ అన్నది: "ఉత్తరంకోసం కలవరించాం. తీరా వచ్చేసరికి చింపి చూడడానికి భయపడుతున్నాం."

"ఎవరు భయపడ్డారు?" అన్నాడతను: "దాన్ని చింపు"

ఆవిడ నిమ్మళంగా, జాగ్రత్తగా ఉత్తరం చింపింది. ఆవిడ ఉత్తరాలు తరచుగా తెరిచిన మనిషి కాదు. ఉత్తరం తెరిచి మడతలు విప్పింది. నిమ్మళంగా, జాగ్రత్తగా తను చదివేది అతనికి వినపడనంత మెల్లగా చదివింది. "గట్టిగా చదువు." అన్నాడతను.

ఆవిడ బిగ్గరగా, జూలూ తెగవారు ఇంగ్లీషు చదివినట్టుగానే చదివింది:

మిషన్ హౌస్,
సోఫియాటౌన్, జోహానసుబర్గు,
25 సెప్టెంబరు 1946.

నా ప్రియమైన క్రైస్తవ సోదరుడా! ఇక్కడ జోహానసుబర్గులో నేనొక యువతిని కలుసుకోవడం తటస్థించింది. ఆవిడ పేరు గెర్ట్రూడ్ కుమాలో.

ఆవిడ ఇన్‌డాట్ పేసీలో సెయింట్ మార్క్ చర్చిలో ఉంటున్న రెవరెండ్ స్టీఫెన్‌కుమాలో యొక్క సోదరి యని నాకు తెలియవచ్చింది. ఈవిడ చాలా జబ్బు స్థితిలో ఉన్నది. కనుక మీరు సత్వరం బయలుదేరి జోహానసుబర్గు రావలసినదిగా కోరుతున్నాను. సోఫియాటౌన్ లోని మిషన్ హౌస్‌లో ఉండే రెవరెండ్ థియోఫిలస్ సిమాంగు దగ్గరికి రావలసినది. అక్కడ మీకు నేను కొన్ని సలహాలిస్తాను. మీరు ఎక్కువ ఖర్చున పడకుండా తగిన వసతికూడా నే నక్కడ మీ కేర్పాటు చేస్తాను.

ఇట్లు,

మీ క్రైస్తవ సోదరుడు, విశ్వాసపాత్రుడు,

థియోఫిలస్ సిమాంగు

వారిరువురూ చాలాసేపు మాట్లాడకుండా ఊరుకున్నారు. చివరకావిడ అడిగింది:

"సరేనండీ, ఏమంటారు?"

"అవును, ఏమిటది?"

"అదే స్టీఫెన్; ఈ ఉత్తరం, విన్నారుకదా?"

"అవును, విన్నాను. ఈ ఉత్తరం అంత తేలికైన విషయం కాదు."

"అవును. తేలికైన విషయంకాదు. మరి మీరేం చేస్తారు?"

"ఆ అమ్మాయి తినడం అయిందా?"

ఆవిడ వంటింట్లోకి వెళ్ళింది. ఆ పిల్లను తీసుకుని తిరిగివచ్చింది.

"తిన్నావా చిన్నారీ?" అని అడిగాడతను.

"అవును, ఉమ్ఫున్‌డీన్."

"అయితే ఇహ వెళ్ళిరా అమ్మా. ఉత్తరం తెచ్చినందుకు నీకు నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. స్టోర్‌లో వుండే ఆ తెల్లజాతి మనిషికికూడా నా కృతజ్ఞతలు అందజేస్తావుకదూ?"

"అలాగే, ఉమ్ఫున్‌డీన్."

"ఇహ వెళ్ళు తల్లీ."

"మీరు క్షేమంగా ఉండండి ఉమ్ఫున్‌డీన్, అమ్మా మీరు క్షేమంగా ఉండండి."

"వెళ్ళు తల్లీ."

అలా ఆ పిల్ల మెల్లగా తలుపుదగ్గరికి వెళ్ళింది. బయటికి వెళ్ళిపోతూ మెల్లగా తలుపుగుబ్బ పట్టుకుని నిమ్మళంగా, నిశ్శబ్దంగా తలుపు మూసింది.

ఆ పిల్ల వెళ్లిపోయిన తరువాత ఆవిడ, భర్తతో అన్నది.

"మీ రేం చేస్తారు స్టీఫెన్?"

"ఏ విషయం?"

భర్తతో ఆవిడ శాంతంగా చెప్పింది: "ఈ ఉత్తరం విషయం, స్టీఫెన్."

అతను నిశ్వసించాడు: "సెయింట్ చాడ్స్ డబ్బు తెచ్చి నాకివ్వు,"- అని చెప్పాడు.

ఆవిడ వెళ్ళింది. తగరపు డబ్బీ ఒకటి చేతపట్టుకుని తిరిగివచ్చింది. వారు కాఫీ, కోకో అమ్మే టిన్నులాంటి టిన్ను అది. అది భర్తకిచ్చింది. దాన్ని చేతపట్టుకుని అతను అందులో ఏదో సమాధానం ఉన్నట్లుగా జాగ్రత్తగా పరిశీలించాడు. చివరకావిడ అన్నది: "స్టీఫెన్! ఆ పని చెయ్యాలి."

"నేను దీన్ని ఎలా ఉపయోగించుకోను?" అన్నాడతను. "ఈ డబ్బు సెయింట్ చాడ్స్‌కు పంపడానికి, అబ్‌సాలమ్‌కు పంపించవలసి ఉంది."

"ఇప్పుడు అబ్‌సాలమ్ సెయింట్ చాడ్స్‌కు వెళ్ళనే వెళ్ళడు."

"అది నీవెలా చెప్పగలవు?" అన్నాడతను కఠినంగా. "అలాంటి మాట నీవెలా అనగలిగావు?"

"వాడు జోహానసుబర్గులో ఉన్నాడు." అన్నదావిడ నీరసబడిపోతూ. "ఎవరైనా ఒకమాటు జోహానసుబర్గు వెళ్ళారూ అంటే మళ్ళీ తిరిగి రావడంకల్ల."

"నీవా విషయం చెప్పావు" అన్నాడతను: "ఇప్పుడది చెప్పడం జరిగింది. ఆ పనికోసమే మన మీ డబ్బు కూడ పెట్టాం. కాని ఎన్నడూ ఆ పనికి ఉపయోగపడలేదు. నీవొక ద్వారం తెరిచి త్రోవ చూపించావు. కనుక ఆ త్రోవన వెళ్ళక తప్పదు. కాని మనమెక్కడికి వెళ్ళాలో ఆ భగవంతుడికి మాత్రమే తెలుసును."

"త్రోవ చూపించింది నేను కాదు" అతని ఆరోపణకు నొచ్చుకుని అన్నదావిడ. "త్రోవ ఏనాడో ఏర్పడింది. కాని మీరే చూచారుకారు."

"మనకొక కొడుకు ఉన్నాడు;" అన్నాడతను పరుషంగా: "జూలూ తెగవారికి సంతానం చాలా ఉంది. కాని మనకు మాత్రం ఒక్కడే కొడుకు. వాడు జోహానసుబర్గు వెళ్ళాడు. నీవన్నట్లు—ఎవరైనా ఒకమాటు జోహానసుబర్గు వెళ్ళారూ అంటే మళ్ళీ తిరిగిరావడం కల్ల. వాళ్లు ఉత్తరం ముక్క కూడా వ్రాయరు. ఏ జ్ఞానం లేకపోతే నల్లజాతివాడు జీవించలేడో దాన్ని ఆర్జించడంకోసం సెయింట్, చాడ్స్‌కు కూడా వెళ్లరు. వాళ్ళు జోహానసుబర్గు వెడతారు. అక్కడే వాళ్ళు గతించిపోతారు. వాళ్లను గురించి ఎవరూ వినను కూడా వినరు. మరి ఈ డబ్బు..."

కాని ఆ విషయంలో ఆవిడ చెప్పేదేమీ లేదు. కనుక అతనే చెప్పాడు: "ఈ డబ్బు ఇక్కడ నాచేతిలో ఉంది." ఆవిడ మాట్లాడలేదు. కనుక మళ్ళీ అతనే చెప్పాడు:

"ఈడబ్బు ఇక్కడ నా చేతిలోవుంది."

"మిమ్మల్ని మీరే నొప్పించుకుంటున్నారు" అన్నదావిడ.

"నేనే నొప్పించుకుంటున్నానా! నేనే నొప్పించుకుంటున్నానా? నన్ను నేను నొప్పించుకోవడంలేదు. వాళ్ళే నన్ను నొప్పిస్తున్నారు. నా కన్నకొడుకు, నాస్వంత చెల్లెలు, నా స్వంత తమ్ముడు; వీళ్ళే నన్ను బాధిస్తున్నారు. వెళ్ళిపోతారు. ఒక్క ఉత్తరం ముక్కయినా వ్రాయరు. బహుశా

మనం బాధపడుతున్నట్లు వాళ్ళకు కనిపించదు కాబోలు. బహుశా వాళ్లు ఆ విషయం పట్టించుకోరు కాబోలు." అన్నాడతను.

అతని కంఠస్వరం హెచ్చింది. బిగ్గరగా కోపంగా మాట్లాడుతున్నాడు: "వెళ్ళు. వెళ్ళి ఆ తెల్లజాతి మనిషిని అడుగు" అన్నాడతను: "బహుశా ఉత్తరాలుండి ఉంటాయి. బహుశా అవి గల్లాపెట్టె క్రిందపడి ఉంటాయి. లేక తిను బండారాల చాటునపడి ఉంటాయి. అక్కడ ఆ చెట్లల్లో చూడు. బహుశా గాలికి కొట్టుకునిపోయి అక్కడ పడి ఉంటాయి."

ఆవిడ ఆపుకోలేక పోయింది. "మీరు నన్నుకూడా బాధిస్తున్నారు" అన్నది.

అతను మళ్ళీ మామూలు మనిషిఅయి నమ్రతగా ఆవిడతో అన్నాడు.

అతను టిన్ను ఆవిడకు అందిస్తూ, "దీన్ని తెరువు" అన్నాడు.

వణుకుతోన్న చేతులతో ఆవిడ టిన్ను అందుకుని మూతతీసింది. టేబిల్ మీద బోర్లించింది ఉన్నదంతా. మాసి మరకలుపడిన కొన్ని పాతనోట్లు, కుప్పలు కుప్పలుగా వెండి, రాగి నాణాలు పడ్డాయి.

"లెక్కపెట్టు" అన్నాడతను.

నోట్లు, నాణాలు అటూ ఇటూ తిప్పిచూచి వాటి విలువెంతో నిర్ధరించుకుంటూ, ఎంతో కష్టంమీద ఆవిడ ఆ డబ్బంతా లెక్కపెట్టింది.

"పన్నెండు పౌనుల, అయిదు షిల్లింగుల, ఏడు పెన్నీలు"

"ఎనిమిది పౌనులు, తక్కిన షిల్లింగులు పెన్నీలు నేను తీసుకుంటాను" అన్నా డతను.

"అంతా తీసుకో స్టీఫెన్. అక్కడ డాక్టర్లు, ఆస్ప త్రులు, ఇంకా ఇతర యిబ్బందులు; ఎన్నో ఖర్చులు. ఆ డబ్బంతా తీసుకో. పోతే, పోస్టాఫీసు ప్యాసుపుస్తకం తీసుకో. అందులో పదిపౌను లున్నాయి—అవికూడా తీసుకెళ్ళాలి."

"ఆ డబ్బు నీ స్టౌ కోసం దాచిపెట్టాను" అన్నాడతను.

"దాంతో ఏమీ కాదు" అన్న దావిడ: "మరి ఆ డబ్బీలో దాచిన డబ్బు సెయింట్ చాడ్స్‌కు పంపడానికని అట్టిపెట్టినప్పటికీ, దాంతో నేను మీకు కొత్తవి నల్లని దుస్తులు, నల్ల హేటు, తెల్ల కాలర్లు కొనాలనుకున్నాను."

"అయితే అదీ అయ్యేపని కాదులే. నన్ను చూడనీ. నేను వెళ్ళాల్సింది..."

"రేపు" అన్న దావిడ: "కారిస్‌బ్రూక్ నుంచి."

"ఇప్పుడే బిషప్‌కు వ్రాస్తాను. ఎంతకాలం పడుతుందో తెలీదనికూడా చెపుతాను."

అతను బరువుగా లేచాడు. ఆవిడదగ్గరికివెళ్ళి ఆవిడ ముందు నిలుచున్నాడు: "నేను నీ మనసు నొప్పించినందుకు విచారిస్తున్నాను" అన్నాడు. "చర్చికివెళ్ళి ప్రార్థిస్తాను."

అతను ఇంట్లోనుంచివెళ్ళాడు. అతను మెల్లగా నడుస్తూ చర్చి తలుపు దగ్గరికి వెళ్ళడం ఆవిడ చిన్నకిటికీలోనుంచి చూచింది.

తరువాత అతని టేబిల్ దగ్గరికివచ్చి కూచుంది—టేబిల్ మీద తలవాల్చుకుని వ్యాధిగ్రస్థుల్లాగా నల్లజాతి స్త్రీలు పడే బాధతో, పశువులుపడే బాధతో, మాటలేని మూగ వాళ్ళుపడే బాధతో ఆవిడ మౌనంగా అలా కూచుండి పోయింది.

*  *

అన్ని మార్గాలూ జోహానసుబర్గుకు త్రోవతీస్తాయి. దీర్ఘమైన రాత్రులంతా కూడా రైళ్ళు జోహానసుబర్గుకు ప్రయాణంచేస్తాయి. అటూ ఇటూ ఊగిసలాడే బండిలోని దీపాల వెలుతురు నిద్రావస్థలోఉన్న గ్రామసీమలో పచ్చిక మీద, రాళ్లమీద పడుతూ ఉంటుంది. హాయిగా కళ్ళు మూతలుపడతాయి.

## 3

బొమ్మలరైలులా ఆ చిన్నరైలుబండి ఉమ్‌జిమ్‌కూలూ లోయనుంచి కొండల్లోకి ఇరుకుపట్టాలగుండా ఎగబ్రాకుతూ పోతుంది. అలా కారిస్‌బ్రూక్ దాకా వెడుతుంది. అది అక్కడ ఆగినప్పుడు మీ రొక్క నిముషంపాటు దిగి మీరు ప్రయాణంచేసివచ్చిన ఆ మహాలోయను పరిశీలించవచ్చును. రైలు మిమ్మల్ని వదిలేసి దాటిపోవడమంటూ ఉండదు. ఎంచేతనంటే ఇక్కడుండే జనమే కొద్దిమంది. మీ రెవరో కూడా అక్కడున్న ప్రతివారికీ తెలుస్తుంది. ఒకవేళ రైలు వదిలేసి దాటిపోయినప్పటికీ— అదేమంత పెద్దవిషయం కాదు.

మీరు వికలాంగులో వృద్ధులో అయితే తప్ప, లేకపోతే మీ అంతట మీరు వెనకాల పరుగెత్తి రైలు అందుకో వచ్చును.

పొగమంచు పట్టినట్లయితే, మీ కీ మహాలోయ ఏమాత్రం అగుపించదు. మీచుట్టూ, దిగువన పొగమంచు సుళ్లుతిరిగిపోతుంది. రైలుబండీ, జనంకూడా ఎవరికి వారు ఓ చిన్న ప్రపంచంలో ఉండిపోతారు. కొందరి కిది ఇష్టం కాదు. చలిగాను, చీకటిగాను ఉన్నట్లనిపిస్తుంది వారికి. కాని మరికొందరి కిది ఇష్టం. ఏదో నిగూఢమైన ఆంతర్యం, ఆక ర్షణ, సాహసకార్యానికి సమారంభం, ఏదో ఎరగనిదానితో సన్నిహితత్వం వారి కిందులో అగుపిస్తాయి. రైలుబండి ఏదో విచిత్ర ఊహాప్రపంచంలోగుండా ప్రయాణంసాగిస్తుంది. మంచు మూసుకున్న అద్దాలలోనుంచి పచ్చని మసక మసక పచ్చిక, అడవిమొక్కలతో నిండిన తరులు కనుపిస్తవి. ఇక్కడ అనేక జాతుల అడవిమొక్కలు, రంగు రంగుల పూలపొదులు వాటి వాటి రుతువుల్లో పెరుగుతాయి. కొండ లోయలో మచ్చల మచ్చల పూలమొక్కలు క్షణమాత్రం కనిపించి పోతాయి. వాటి వెనకాలే చిరురెమ్మలు చిక్కగా అల్లుకుని కంచెగా ఏర్పడిన బారు మసగ్గా ఆ పొగమంచులో మీకు కనిపిస్తుంది.

కారిన్ బ్రూక్ వద్ద రైలుకోసం వేచిఉండడం ఎంతో కుతూహలాన్ని రేకెత్తిస్తుంది— పెద్ద లోయలోంచి రైలు బయటపడి కొండ లెక్కి రావడం చూడముచ్చట గొలుపు తుంది. రైలు కూత కూసినప్పుడల్లా అది యెక్కడఉన్నదీ,

ఏ రోడ్డుదగ్గర ఉన్నదీ, ఏ పొలందగ్గర, ఏ నదిదగ్గరఉన్నదీ ఎరిగినవారు మీకు చెప్పగలరు. బండివచ్చే వేళకు గంట ముందుగానే వెళ్ళి కాచుకు కూచున్నప్పటికీ స్టీ ఫెన్ కుమాలో ఈ విషయా లేవీ వినలేదు. ఇది చాలా దూరప్రయాణం, బోలెడంత డబ్బూ ఖర్చుపెట్టవలసిఉంది. మరి అతని చెల్లెలుకు ఎంత జబ్బుగా ఉందో, అందు కెంత డబ్బు ఖర్చవుతుందో మెవ రెరుగుదురు? పోతే ఆవిడను తిరిగి ఇంటికి తీసుకరా వలసివస్తే, దాని కెంత డబ్బు కావలసి ఉంటుందోకూడా? జోహానసుబర్గు ఒక మహానగరం. లెక్కలేనన్ని బజార్లుంటా యనీ, ఒక వీధిన పోవడం, మరో వీధిన రావడం అలా తిరిగిన వీధి తిరగకుండా ఎవరైనా రోజులు గడపవచ్చనీ చెపుతారు! అక్కడ బస్సులుకూడా ఎక్కవలసిఉంటుంది. కాని ఇక్కడలాగా ఏ చిక్కు లేకుండా ఒకే బస్సు కాదు. అక్కడ బస్సులు గుంపులు గుంపులు. పదిబస్సులు వస్తే అందులో ఒకటి, ఇంకా మాట్లాడితే ఇరవై బస్సులు వస్తే అందులో ఒకటి, నీవు ఎక్కాల్సిన బస్సు. పొరపాటున వేరే బస్సెక్కావూ అంటే అది మిమ్మల్ని మరెక్కడికో తీసుక పోతుంది. ఇహపోతే బజార్లో అటునుంచి ఇటు అడ్డంగా నడవడమే ప్రమాదమని చెపుతారు. ఎవరికైనా వెళ్ళాల్సిన అవసరమొస్తే మరి? ఇన్ డాట్ షేనీ వాసియైన పాంజాభార్య పాంజా చావసిద్ధమై ఉండగా అక్కడికి వెళ్ళింది. అప్పుడు తన కన్నకొడుకు మైఖేల్ వీధిలో చావడం కళ్ళారా చూచింది. పన్నెండేండ్లు ఉద్రేకంలో కొట్టుకపోయినవాడల్లా అతను కొంచెం దూరంవచ్చి ప్రమాదంలో చొరబడ్డాడు.

ఆవిడ వస్తాయిస్తూ నిలుచుంది. ఆవిడ చూస్తుండగానే దయ్యమంత లారీవచ్చి కొడుకును నుగ్గు నుగ్గుచేసి పోయింది.

పోతే పెద్ద భయంకూడా ఒకటి— చాలా అపురూపంగా అనుకుంటునప్పటినుంచీ అమితభయం ఉంటూనే వచ్చింది. వాళ్ళ కుమారు డెక్కడున్నాడు? ఇంత కాలమైనా ఒక్క ఉత్తరంముక్క వ్రాయడేం?

చివరికూత వినిపించింది. చివర కెలాగైతేనేం రైలు సమీపంలోకి వస్తోంది. పాదిరి తనస్నేహితుడివైపు తిరిగాడు.

"స్నేహితుడా, నీ సహాయాని కెంతో కృతజ్ఞుణ్ణి" అన్నాడు.

"ఉమ్ఫున్‌డీస్! మీకు సహాయపడడం నా కెంతో సంతోషం. మీ ఒక్కరికీ ఇది కష్టమైనపని. ఈ సంచి బరువుగా ఉంది."

రైలు ఇంకా దగ్గరికి వచ్చింది. త్వరలోనే లోనికి వస్తుంది.

"ఉమ్ఫున్‌డీస్!"

'చెప్పు, నాయనా?"

"ఉమ్ఫిన్‌డీస్, మిమ్మల్ని ఒక ఉపకారం చేసిపెట్టమని అడగాలనుకుంటున్నాను."

"అయితే అడుగు నాయనా!"

"సిబెకోను మీ రెరుగుదురా?"

"ఆ."

"సరే, సిబెకో కుమార్తె ఇక్కడ ఇక్ హూఫోలో తెల్ల జాతివాడైన యుస్మిత్ దగ్గర పనిచేసింది. యుస్మిత్ కుమార్తెకు పెండ్లయినప్పుడు ఆవిడ జోహానసుబర్గు వెళ్ళింది. వారితోపాటు సిబెకో కుమార్తెకూడా, పని చేయడానికై వెళ్ళింది. వివాహం చేసుకున్నప్పుడు ఈవిడ పెట్టుకున్న కొత్తపేరు, అడ్రస్సు ఇక్కడ నా దగ్గర ఉంది. కాని యీ పదిపన్నెండు నెలలబట్టీ సిబెకోకు తన కూతురు జాడే తెలియు లేదు. అంచాత ఆ విషయం కాస్త విచారించమని అతను మిమ్మల్ని అడగమన్నాడు."

మొరటుగా పట్టుకున్నందున మాసిపోయి, అసహ్యంగా ఉన్న ఆ కాగితాన్ని తీసుకుని చూచాడు కుమాలో. "స్ప్రింగ్సు" అన్నాడతను; "నే నా ప్రదేశాన్ని గురించి విన్నాను. కాని దాపులోనే ఉన్నదని చెప్పినప్పటికీ అది జోహానసుబర్గు కాదు. నాయనా! రైలు రానే వచ్చింది. నేను చేయకలిగింది చేస్తాను" అన్నాడు.

అత నా కాగితం తన సంచీలో పెట్టుకున్నాడు. వారిరువురూ రైలు రాకను గమనిస్తూ నిలుచున్నారు. దక్షిణాఫ్రికాలో గ్రామసీమల రైళ్ళన్నిట్లో లాగానే అందులోకూడా నల్లజాతివారైన ప్రయాణీకులే కిక్కిరిసి ఉన్నారు. అయితే ఈ బండీలో తక్కినవారు ఎక్కువమంది లేరు. ఈ జిల్లా లోని యూరోపియనులందరికీ స్వంత కార్లున్నాయి. వారు రైల్లో ప్రయాణం చేయడం చాలా సకృతు.

కుమాలో యూరోపియనులు కాని వారికోసం ఏర్పాటు చేయబడిన పెట్టెలో ఎక్కాడు. అప్పటికే పెట్టె అణిగి

పడుండే తన జాతి జనంతో కిక్కిరిసివుంది. కొందరు చిత్రమైన రకరకాల యూరోపీయ ఉడుపులు ధరించారు. కొందరు తాము ధరించిన విచిత్రమైన దుస్తులపై దుప్పట్లు కప్పుకున్నారు. కొందరైతే స్త్రీలు—ఆదిమవాసుల్లా అర్ధనగ్నంగా దుస్తులు ధరించి వాటిపై దుప్పట్లు వేసుకున్నారు. పురుషులు మాత్రం ఇప్పుడు ప్రాచీనపు దుస్తులు ధరించడం లేదు.

ఆరోజు వెచ్చగా ఉంది. పెట్టెలో వాసన భరించలేనంతగా ఉంది. కాని నమ్రతవల్ల కుమాలో ఇవేవీ అంతగా పట్టించుకోలేదు. వారంతా అతని చొక్కా కాలరు చూచి పాదిరి అని తెలుసుకున్నారు. ఉమ్ఫున్‌డీస్‌కు జాగా ఇవ్వడం కోసం అటూఇటూ జరిగారు. తను ముచ్చట్లాడడానికి ఎవరైనా దొరుకుతారేమో అని అతను నలువైపులా కలయ చూచాడు. కాని అతని తరగతి మనిషి ఒక్కడూ అక్కడ లేడు.

అతను తన స్నేహితుడిదగ్గర సెలవు తీసుకోవడానికై కిటికీవైపు తిరిగాడు.

"సిబెకో స్వయంగా నా దగ్గరికి వచ్చాడు కాదేం!" అని అడిగాడు.

"అతను భయపడ్డాడు ఉమ్ఫున్‌డీస్. అతను మన చర్చికి చెందినవాడు కాదు."

"అతను మన జనులకు చెందినవాడు కాదా? ఆపదలో ఉన్న మనిషి తన చర్చికి చెందినవారి దగ్గరికి మాత్రమే వెడతాడా ఏమిటి?"

"నే నతనికి చెపుతాను, ఉమ్ఫున్ డీన్."

ఇతరులు తన మాట వినాలని కోరుకునే పసిపిల్లవాడి స్వరంలాగా కాక బాగా వయస్సు వచ్చిన వాడిలాగా కుమాలో కంఠస్థాయి కొంచెం హెచ్చింది.

"నేను జోహానసుబర్గులో ఉన్నప్పుడు స్ప్రింగ్సుకు వెడతానని అతడితో చెప్పు." ఆ కాగితం సంచిలో పెట్టి తన జేబులో భద్రంగా ఉన్నదని చెప్పడానికై అతను జేబుమీద తట్టాడు. "ఆ అమ్మాయిని గురించి విచారిస్తానని అతనికి చెప్పు. కాని నేను పనితొందరలో ఉంటానని చెప్పు. జోహానసు బర్గులో నేను చేయవలసిన పనులు చాలా ఉన్నాయి."

అతను కిటికీనుంచి అవతలికి మళ్ళాడు. "ఎప్పుడూ ఇంతే." అన్నాడతను తనలో తాను అనుకున్నట్లుగా కాని నిజానికి ఆ చెప్పింది జనానికి.

"అతనికిగాను నా కృతజ్ఞత తెల్పుతున్నాను, ఉమ్ ఫున్ డీన్."

రైలుకూత కూసి కదిలింది. కదిలేటప్పుడు ఇచ్చిన కుదుపుకు నిలుచునిఉన్న కుమాలోకు దాదాపు పడబోయే టంతపని అయింది. ఇహ అతను కూచుంటే క్షేమకరంగాను తగినట్లుగాను ఉంటుంది.

"ఇహనీవు ఉండు నాయనా!" అన్నాడతను.

"మంచిది. మీరు వెళ్ళిరండి, ఉమ్ఫున్ డీన్"

అతను వెళ్ళి తన జాగాలో కూచున్నాడు. వెళ్ళక వెళ్ళక జోహానసుబర్గు వెళుతున్న ఆ వృద్ధునివంక జనం

ఆసక్తితో, గౌరవంతో చూచారు. రైలుబండి త్రోవపట్టింది. కొండదరుల వెంబడి పారాడుతూ, నిట్రంగా లోయలపై వ్రేలాడుతూ, అడవి పొదలను పూలమొక్కలను దాటు కుంటూ, చిరురెమ్మలతో కొమ్మలతో చిక్కగా అల్లుకున్న చెట్లతోపుల చీకట్లోకి ప్రవేశిస్తూ, స్టేషన్ దాటి ఇక్ హోపో దిగువకు పోతున్నది.

ప్రయాణం మొదలైంది. మళ్ళీ ఇప్పుడు కుమాలోకు వెనుకటి భయం పట్టుకుంది. ఏదో ఎరగనిదాని భయం, కుర్రవాళ్ళు రోడ్డుమీద అడ్డంగా దాటేటప్పుడు హతంచేసే ఆ మహానగరం భయం, గెర్ట్రూడ్ జబ్బుభయం, తన కొడుకును గురించి విపరీతమైన భయం; తనదికాని లోకంలో జీవిస్తూ, తనదైన లోకం జారి దూరమైపోతూ, చనిపోతూ, ధ్వంసమై పోతూవుంటే మళ్ళించడానికి శక్యంకాని ఒకానొక మనిషిలో ఏర్పడ్డ భయం.

మర్యాదస్థులైన ఈ మనుష్యులముందు ఒక్క నిము షం సేపట్నుంచీ స్వల్పంగా అహంకారం చూపి, సల్పంగా అసత్యమాడిన ఆయన కాళ్లు అప్పుడే చచ్చుపడిపోయినాయి.

నమ్రతతో తన జేబులో ఉన్న పవిత్రగ్రంథం తీసి చదవడం మొదలుపెట్టాడు. ఈ లోకం ఒక్కటి మాత్రం రూఢిఅయింది.

ఆ చిన్న రైలు ఇక్ హోపోనుంచి వేరే కొండల్లో గుండా పోతోంది. పచ్చగా, దొంతులు దొంతులుగా ఉన్న కొండలు- లుఫాఫా, ఈస్టవాల్ట్స్, డోన్నిబ్రూక్. డోన్నిబ్రూక్ నుంచి రైలురాస్తా బ్రాడ్ గేజ్ గా మారి బ్రహ్మాండమైన ఉమ్కోమాస్ లోయలోకి వెడుతుంది. ఇక్కడ ఒకే తెగకు చెందిన జనులు నివసిస్తుంటారు. భూసారం ఏమాత్రం మంచిదికాదు. ఈ భూమి, ఈ జనం బాగయ్యే పరిస్థితి— లేనేలేదు. రైలు ఈ లోయ దాటివచ్చి హెమూ—హెమూ ప్రక్కగుండా ఇలాండ్ స్కాప్ మీదుగా ప్రయాణంచేస్తుంది. పొడుగాటి ఉమ్సిన్ డూసీ లోయ దిగువగా ఇడెన్ డేల్, పల్లంలో నల్లగా కనిపించే నగర పరిసరాలు దాటి పీటర్ మారిట్జుబర్గు నగరం చేరుకుంటుంది. చూడ ముచ్చటైన నగరం ఇది. జోహానసుబర్గు వెళ్ళడానికి ఇక్కడ బండిమారి వేరే బండి ఎక్కాలి. అన్నిట్లోకీ పెద్దబండి అది. తెల్లవాడి తెలివంతా ఇక్కడే వుంది. ఇంజన్ లేని రైలు-రైలు తల మీద ఒక ఇనపగూడులాంటిది మాత్రమే ఉంటుంది. ఇది పైన విస్తరించుకుని ఉన్న లోహపు పట్టీలనుంచి శక్తిని గుంజుకుంటుంది.

హిల్టన్, లయన్ నది, బాల్గోవన్, రొజెట్టా, మూయ్ నది; ఈ కొండల పైనుంచి నదులపైనుంచి రైలు పోతుంటే ఎంత మనోహరంగా ఉంటుందో మాటలతో వర్ణించలేము. రాత్రివేళ బిగ్గరగా గర్జిస్తూ ఈ కొండలమీద పోతుంది రైలు.

డ్రాకేన్సుబర్గు పర్వత పంక్తులమీదనుంచి సమతల మైదానాలలోకి దిగుతుంది. అటూ ఇటూ ఊగిసలాడే రైలు బండిలో మేలుకొని ఉండి, తెల్లవారగట్ల మసక వెలుతురులో చూస్తే మళ్ళీ ఇంజను ఆవిరి విడవడం కనిపిస్తుంది. ఇహ ఇప్పుడు రైలు తలమీద లోహపు పట్టీలు ఉండవు. ఇదొక కొత్తదేశం. విచిత్రమైన దేశం. కనుచూపుమేర దొంతులు దొంతులుగా కనిపించే దేశం. ఇక్కడ అన్నీ కొత్తపేర్లు. ఇంగ్లీషు బళ్ళల్లో చదువుకున్న జూలూ తెగవారు ఈ గొట్టు పేర్లు నోరు తిరక్క తికమక పడుతుంటారు. వారి భాషను ఆఫ్రికాన్ల భాష అని పిలుస్తారు. ఇంతవరకూ ఈ భాష మాట్లాడంగా అతను విన్నపాపాన పోలేదు.

"గనులు, గనులు" అని వారు కలవరిస్తారు. వారిలో అనేకమంది గనులలో పనిచేయడానికి వెడుతున్నారు.

"దూరంగా కనిపించే చదునుగా ఉన్న ఆ కొండ లేనా ఈ గనులు?" అని అతను నిర్భయంగా అడుగుతాడు. అతని మాటలు ఇక్కడ ఇంతకు ముందెవరూ వినలేదు.

"అది గనులలోనుంచి తీసిన బండ ఉమ్‌ఫున్‌డీస్. దానిలోనుంచి బంగారం తీస్తారు."

"ఆ బండ బయటికెలా వచ్చింది?"

"మేము గనులలోదిగి దాన్ని త్రవ్వి బయటికి తీస్తాం ఉమ్‌ఫున్‌డీస్. త్రవ్వడం కష్టంగా ఉన్నప్పుడు మేమంతా అవతలికి వెళ్ళిపోతాం. తెల్లవాళ్ళు తుపాకిమందు పెట్టి గనులు పగలగొడతారు—అప్పుడు మళ్ళీ మేం వచ్చి ఆ బండలన్నీ బయటికి తీస్తాం. వాటిని ట్రక్కులమీది కెత్తుతాం.

ఆ ట్రక్కులు ఒక బోనులాంటి దాంట్లో ఉంచుతారు. అది గనుల అడుగునుంచి పైకి పోతుంది. చాలా పైకిపోతుంది. ఎంతపైకి పోతుందో నేను చెప్పలేను."

"అదెలా పైకి పోతుంది?"

"దానికొక పెద్ద చక్రం చుట్టచుట్టుకుని ఉంటుంది. ఉండండి. అలాంటిది మీకొకటి చూపిస్తాను."

అతను మాట్లాడకుండా ఊరుకున్నాడు. భయంతోను, ఉద్వేగంతోను అతని హృదయం కొంచెం వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టింది.

"ఉమ్‌ఫున్‌డీస్, అదిగో చక్రం. అటు చూడండి. అదే ఆ చక్రం."

ఒకపెద్ద, దయ్యమంత ఇనప కట్టడంలాంటిది ఆకాశంలో పైకిపోతోంది. దానిపైన ఒకపెద్ద చక్రంవుంది. చక్రం ఆకులు గిర్రునతిరిగి పోతున్నాయి. అది అలా చెప్పలేనంత వేగంతో రివ్వునపైకి లేచిపోతూఉంటే, చూచేవారి కళ్ళు చెదిరిపోతున్నాయి. పెద్ద పెద్ద భవంతులు కనిపిస్తున్నాయి. గొట్టాలలోనుంచి పొగ చిమ్ముతోంది. జనం ఉరుకులు, పరుగులు తీస్తున్నారు. తెల్లగా మెరుస్తున్న ఒక పెద్ద కొండ. ట్రక్కులు వరుసగా, బారుతీరి ఆ కొండపైకి ఎక్కుతున్నాయి. ఆ బారుకు అంతు కనిపించడంలేదు. ఆ బారు బారు ఎక్కడికో ఆకాశంలోకి పోతున్నట్లుగా ఉంది. ఇహ నేలమీద చెప్పనక్కర్లేదు. మోటారుకార్లు, లారీలు, బస్సులు, బండ్లు—ఒకటే రొద. అంతులేని అలజడి.

"అదేనా జోహానసబర్గు నగరం?" అని అతను అడుగుతాడు.

కాని వారు తమలో తాము నవ్వుకుంటారు. అందులో కొందఱు మంచి అనుభవంకలవాళ్ళు - "ఇదొక లెక్కలోది కాదు. జోహానసబర్గులో ఇంకా పెద్ద పెద్ద భవంతులు, కట్టడాలు ఉన్నాయి. ఎంతో ఎత్తుగా ఉన్నాయి" అంటారు వాళ్ళు. కాని వారుకూడా వాటినిగురించి వర్ణించి చెప్ప లేరు.

చివరకు వారిలో ఒకడు "అన్నా! నీకు తెలుసుకదూ, మా నాన్న ఉండే గుడిసె వెనకాల ఒక పెద్ద కొండ నిటారుగా నిలబడి ఉందే- అంత ఎత్తున ఉంటాయి అక్కడి భవంతులు" అని చెపుతాడు.

అదినిజమే నన్నట్లు మరొకడు తల ఊపుతాడు. కాని కుమాలో మాత్రం ఆ కొండను ఎరుగడు.

ఇహ ఇప్పుడు భవంతులకు, కట్టడాలకు అంతేలేదు. అవును. భవంతులు, తెల్లటికొండలు, పెద్దపెద్ద చక్రాలు, లెక్కలేనన్ని వీధులు, సందులేకుండా కార్లు, లారీలు, బస్సులు.

"ఇది తప్పకుండా జోహానసుబర్గు నగరమే" అంటాడతను.

కాని మళ్ళీ వాళ్ళు పకాలుమని నవ్వుతారు. అతని మాటలు వింటోంటే వారికి విసుగు పుడుతుంది.

"ఇదొక లెక్కలోదికాదు" అంటారు మళ్ళీవాళ్ళు.

రైల్వేలైనులు, రైల్వేలైనులు. ఓ! అద్భుతం! కుడి వైపున రైలుపట్టాలు, ఎడమవైపున రైలుపట్టాలు- ఇటు చూచినా అటు చూచినా, ఎటుచూచినా రైలుపట్టాలు. పాపం అవి అతని లెక్కకు అందవు. హఠాత్తుగా ఒకరైలు దూకుతూ వస్తుంది. ఉరుము ఉరిమినట్లు కూతపెడుతుంది. అతను ఉలిక్కిపడి కూచున్నచోటునించి పడబోతాడు. మరో రైలుబండి వారికి అవతలిప్రక్కనుంచి పట్టాలమీదిగా పరుగెత్తుతూ వస్తుంది. కాని మళ్ళీ అంతలోనే వేగం తగ్గించి మెల్లగా వెనకపడుతుంది. రైల్వేస్టేషన్లు, రైల్వే స్టేషన్లు-వాటికి అంతూపంతూలేదు. అన్ని స్టేషన్లు ఉంటాయని అతను జన్మలో ఊహించి ఉండడు. ఒక్కొక్క స్టేషనులో వందలకొద్దీ జనం రైలుకోసం పడిగాపులు కాస్తూ ఉన్నారు. కాని పాపం వారికి రైలు అందదు. అందరినీ హతాశులను చేసి అదికాస్తా తుర్రున వెళ్ళిపోతుంది.

ఇంకా ఎత్తయిన మేడలు, భవంతులు. ఇంకా ఎక్కువ-లెక్కపెట్టలేనన్ని వీధులు.

ఇంత గడబిడలో ఎవడైనా ఎలా త్రోవ కనుక్కో గలుగుతాడు! అప్పటికి కనుచీకటి పడింది. వీధుల్లో ఇప్పు డిప్పుడే దీపాలు వెలుగుతున్నాయి.

ఎవరో ఒకరు అతన్ని హెచ్చరిస్తారు:

"ఉమ్షున్ డీన్! అదిగో, జోహానసుబర్గు వచ్చింది."

అతను ఆత్రుతతో చూస్తాడు. ఆకాశం అంటుకున్న పెద్దపెద్ద భవంతులు కనిపిస్తాయి. ఆ భవంతుల మీాద మళ్ళీ

వాటంతవెత్తున ఎర్రని, ఆకుపచ్చని దీపాలు వెలుగుతుం టాయి. అవి చటుక్కున వెలిగి దబుక్కున ఆరిపోతుంటాయి. ఒక సీసాలోనుంచి నీళ్ళు బయటికొస్తుంటాయి. ఒకగ్లాసు నిండేదాకా అలా వస్తూనే ఉంటాయి. గ్లాసు నిండగానే దీపాలు ఆరిపోతాయి. మళ్ళీ దీపాలు వెలిగేసరికి, అదిగో, చూడండి! సీసా నీళ్ళతోనిండి నిటారుగా నిలబడి ఉంటుంది. గ్లాసేమో ఖాళీగా ఉంటుంది. తరువాత మళ్ళీ సీసాపైకి పోతుంది. ఈ విచిత్రాన్ని నలుపు, తెలుపు అని పిలుస్తారు. నిజానికిది ఎరుపు, పచ్చ అయినప్పటికీ నలుపు, తెలుపు అనే అంటారు. ఈ తమాషా ఏమిటో అర్థంకావడం కష్టం.

అతను మౌనం వహించాడు. అతనికి తల కటకట లాడుతోంది. అతను భయపడ్డాడు. అతను దిగవలసిన రైల్వే స్టేషన్ రానేవస్తుంది. భూగర్భంలో నిర్మించిన బ్రహ్మాండమైన స్టేషన్ అది. అన్నీ నేలలో తొలిచిన సొరంగాలు. రైలువచ్చి ఒకపెద్ద కప్పుక్రింద ఆగుతుంది. భూమిలోకికట్టిన మెట్లు కనిపిస్తాయి. నేలలో త్రవ్విన సొరంగం ఇదే. ఈ సొరంగంనిండా జనం క్రిక్కిరిసిఉంటారు. కొన్ని వేలమంది–తెల్లజాతులవాళ్ళు, నల్లజాతులవాళ్ళు. కొందరుపోతుంటారు, కొందరు వస్తుంటారు, అతను తనసంచీ జారిపోకుండా గట్టిగా పట్టుకుంటాడు. ఆ జనసమ్మర్దంలో ఎవరిమీద పడతానో అన్న భయంతో జాగ్రత్తగా నడిచి వెడతాడు. స్టేషన్‌లో నుంచి ఒకపెద్ద హాలులోకి వస్తాడు. జనం ప్రవాహంలాగా మెట్లెక్కి పోతుంటారు. వారితోపాటే అతనూ మెట్లెక్కి

బయటపడతాడు. ఇహ ఇప్పుడతను నగరవీథిలో ఉన్నాడు. సందడి ఇంతా అంతా కాదు. కార్లు, బస్సులు, వరుసగా ఒకదాని వెనుక ఒకటి—అతను ఊహించిన దానికి ఇబ్బడి ముబ్బడిగా ఉన్నాయి. వీధివెంట ప్రవాహంలాగా వెడుతున్న వాటిని చూచేసరికి అతనికి పాంజాకుమారుడు జ్ఞాపకం వచ్చాడు. వెంటనే భయంపుట్టింది. వాటివెంట వెళ్ళడానికి జంకాడు. దీపాలు ఆకుపచ్చనుంచి ఎరుపురంగుకు మారుతున్నాయి. మళ్ళీ అంతలోనే ఆకుపచ్చ రంగుకు తిరుగుతున్నాయి. ఈ విషయాన్ని గురించి చెప్పగా అతను విన్నాడు. దీపాలు ఆకుపచ్చరంగుకు తిరిగినపుడు నీవు వెళ్ళవచ్చును. కాని తీరా అతను అడ్డంగా రోడ్డు దాటడానికి ప్రయత్నించే సరికే ఒకపెద్ద పర్వతంలాంటిబస్సు దూకుతూ వచ్చి అతనిత్రోవకు అడ్డు తగులుతుంది. అలాంటప్పుడు తప్పించుకోటానికి ఏదో చట్టం ఉన్నదికాని, పాపం అది అతనికి అవగతం కాదు. అంచాత మళ్ళీ వెనక్కు వస్తాడు, ఎక్కడో గోడదగ్గర కాస్త స్థలం చూచుకుంటాడు. ఏదో పనికోసం వేచిఉన్న వాడికిమల్లే గోడకానుకుని నిలుచుండిపోతాడు. పసిపిల్లవాడి హృదయంలా అతని హృదయం కొట్టుకుంటుంది. కాని ఏమీ చేయలేడు. ఆ భయం పోవడమెలాగో ఆలోచించుకోనూ లేడు. "భగవంతుడా! నన్ను కాపాడు. భగవంతుడా! నన్ను కాపాడు." అని తనలో తాను ప్రార్థించుకుంటాడు.

ఒక యువకుడు అతని దగ్గరికి వచ్చాడు. ఏదోభాషలో మాట్లాడాడు. ఆ భాష అతనికి అర్థంకాలేదు.

"మీ భాష నాకు తెలీదు" అన్నాడతను.

"అయితే మీరు కోసా జాతివారా ఉమ్‌ఫున్‌డీస్ ?" అని ఆ యువకుడు ప్రశ్నించాడు.

"జూలూ జాతివాణ్ణి" అని అతను సమాధాన మిచ్చాడు.

"మీరెక్కడికి వెళ్ళాలి ఉమ్‌ఫున్‌డీస్ ?"

"సోఫియాటౌన్‌కు వెళ్ళాలి నాయనా."

"అయితే నాతో రండి. చూపిస్తాను."

యువకుని ఉపకారబుద్ధికి అతను కృతజ్ఞత చూపాడు. కాని ఒక చెంపన అతను బెదిరిపోతూనే ఉన్నాడు. తనసంచీ మాత్రం యువకుని చేతికివ్వలేదు. చిత్రమైన జూలూభాషలో ఆ యువకుడు మర్యాదగా మాట్లాడాడు.

దీపాలుమళ్ళీ ఆకుపచ్చ వర్ణానికి తిరిగాయి. అతని వెంట ఉండి త్రోవ చూపిస్తున్న యువకుడు నడకసాగిం చాడు. వారు రోడ్డు ఈవలిపక్కనుంచి ఆవలిపక్కకు దాటు తున్నారు. మరోకారు త్రోవకడ్డుగా వచ్చింది. కాని యువ కుడు సంకోచించలేదు, తొట్రుపడలేదు. కారు ఆగింది. నిజంగా అలా నడక సాగించడంచూస్తే ఎవరికైనా ధైర్యం వస్తుంది.

వారు ఎత్తుగాఉన్న భవంతుల క్రిందినుంచి అనేక మలుపులు తిరిగిన త్రోవలగుండా పోతున్నారు. ఆ మలు పులు తిరగడం, ఆ త్రోవలు కనిపెట్టడం పాదిరికి కష్టమని పిస్తోంది. చివరకు చేతిలోఉన్న సంచీ భారమనిపించింది.

రెక్క తీపుపుట్టింది. ఆఖరుకు వారు అనేక బస్సులున్న ప్రదేశంలోకి వచ్చారు.

"మీరిక్కడ వరుసలో నిలుచోవాలి ఉమ్ఫున్‌డీస్. మీదగ్గర టిక్కెట్టుకు డబ్బులున్నాయికదూ?"

ఈ యువకుడు తనపట్ల చూపుతున్న దయకు తానెంతో పొంగిపోతున్నా నన్నట్లుగా పాదిరి త్వరత్వరగాను, ఆసక్తితోను సంచీతీసి క్రింద పెట్టాడు. అందులోనుంచి తన పర్సు బయటికి తీశాడు. టిక్కెట్టుకు ఎంత డబ్బు అవుతుందని కూడా అడగలేకపోయాడు. గుండె నిబ్బరం లేక వణికిపోతున్నాడు. పర్సులో నుంచి ఒక పౌను నాణెం బయటికి తీశాడు.

"మీకు నేను టిక్కెట్టు తెచ్చిపెట్టనా ఉమ్ఫున్‌డీస్? నేను టికెట్ ఆఫీసుకువెళ్ళి టిక్కెట్టు కొనుక్కొస్తాను. అప్పటిదాకా మీరిక్కడే వరుసలో నిలవబడి ఉండండి. మీ జాగా పోకుండా ఉంటుంది" అన్నాడు యువకుడు.

"నీ ఉపకారానికి కృతజ్ఞుణ్ణి నాయనా" అన్నాడతను.

యువకుడు అతని దగ్గరనుంచి డబ్బుతీసుకుని నాలుగడుగులు వేసి ఒకమూలకు వెళ్ళాడు. అతనలా వెళ్ళాడో లేదో క్షణంలో భయకంపితుడైనాడు. తాను జనంవరుసలో నిలుచుని ఉన్నాడు. ఆ వరుస వరుస ముందుకు సాగిపోతోంది. దాంతోపాటు అతనూ పోతున్నాడు. చంకలో సంచీని అదిమిపట్టుకున్నాడు. జనం ఇంకా ముందుకు పోతున్నారు, ఇంకా ఇంకా ముందుకు. ఇహ కొంచెంసేపట్లో

అతను బస్సెక్కాలి. కాని అప్పటికీ అతనికి టిక్కెట్టు అంద లేదు. హఠాత్తుగా ఏదో ఆలోచన వచ్చినట్లు అతను తాను నిలుచున్న వరుస తప్పించి అవతలికి వెళ్ళాడు. యువకుడు వెళ్ళిన మూలకు వెళ్ళి చూచాడు. కాని అతనక్కడ లేడు—అతినిజాడే కనిపించలేదు. ఎవరినైనా అడుగుదామని గుండె గట్టిచేసుకున్నాడు. శుభ్రమైన దుస్తులు ధరించి, మర్యాదగా కనిపిస్తున్న కాస్త వయస్సుమళ్ళిన ఒకాయన దగ్గరికి వెళ్ళాడు.

"టిక్కెట్టు ఇచ్చేది ఎక్కడ బాబూ?" అని అడిగాడు.

"ఏం టిక్కెట్టు ఉమ్ఫున్ డీన్?"

"బస్సులో వెళ్ళడానికి టిక్కెట్టు."

"బస్సుటిక్కెట్టు బస్సులోనే ఇస్తారు. అంతేకాని వేరే టికెట్ ఆఫీసంటూ ఏమీ లేదు'" అని చెప్పాడా పెద్ద మనిషి.

ఆయనెంతో మర్యాదస్థుడిలా అగుపిస్తున్నాడు. పాదిరి ఆయనతో నమ్రతగా మాట్లాడాడు.

"ఒక యువకుడు నాదగ్గర ఒకపౌను పట్టుకెళ్ళాడు. టికెట్ ఆఫీసుకుపోయి టిక్కెట్టు కొనుక్కొచ్చి ఇస్తానని చెప్పి వెళ్ళాడు." అని చెప్పాడు.

"మీరు మోసపోయారు ఉమ్ఫున్ డీన్. ఆ యువకుడు మీకు కనిపిస్తాడా? వట్టిది. అతను మళ్ళీ మీకంట పడడు. చూడండి, నాతోరండి. మీరెక్కడికి వెడుతున్నారు, సోఫియా టౌనుకా?"

"అవును, సోఫియాటౌనుకే. అక్కడున్న మిషన్ హౌస్‌కు వెళ్ళాలి."

"అయితే సరే - నేనుకూడా ఆంగ్లేయ చర్చివాడనే. నేనిక్కడ ఒకరికోసం కనిపెట్టుకుని ఉన్నాను. అయినా ఇహ ఉండక్కర్లేదులెండి. వెడదాం. నేను మీతో వస్తాను. రెవరెండ్ సిమాంగును మీరెరుగుదురా?"

"ఆ, తెలుసును. ఆయన దగ్గరనుంచి నాకో వుత్తరం వచ్చింది."

వారు మళ్ళీవచ్చి వరుసలో చిట్టచివర నిలుచున్నారు. ఇహ అట్టే ఆలస్యంలేకుండానే వారు బస్సు ఎక్కగలిగారు. బస్సు కదిలింది! రాకపోకలు సమ్మర్దంతో అలజడిగా ఉన్న వీధుల్లోనుంచి బస్సు వెడుతోంది. డ్రైవర్ నిర్లక్ష్యంగా పోగపీలుస్తున్నాడు. నిజంగా అతని సాహసానికి మెచ్చుకోవాలి. వీధి తరువాత వీధి, దీపం తరువాత దీపం—చూడబోతే వీటికి అంతులేదనిపిస్తోంది. మధ్యమధ్య అయితే బస్సు మరీ వేగంగా వెడుతోంది, ఆ వేగానికి బస్సు అటు ఇటు ఉయ్యాల లూగుతోంది. ఇంజను చప్పుడుకు చెవులు గింగురు మంటున్నాయి.

వారొక చిన్న వీధిలో బస్సుదిగారు. కాని అక్కడ కూడా వేలకొద్దీ జనం ఉన్నారు. వారలా జనంతో కిక్కిరిసి ఉన్న వీధులలోనుంచి త్రోవ చేసుకుంటూ నడవడం మొదలు పెట్టారు. అలా ఎంతోదూరం నడిచారు. కొత్తగా తటస్థపడిన ఈ స్నేహితుడు పాదిరి సంచీని మోసుకుపోతున్నాడు. అయినా పాదిరికి అతనిపై నమ్మకం కుదిరింది. చివరకువారు

దీపకాంతితో ప్రకాశిస్తున్న ఒక ఇంటిముందు ఆగాడు. వెంట ఉన్న వ్యక్తి ఆ ద్వారం చెంతకు వెళ్ళి తలుపు తట్టాడు.

మిలిగుసుప్పురుషుల్లో ఉన్న ఒక పొడుగాటి యువకుడు వచ్చి తలుపు తెరిచాడు.

"మిస్టర్ సిమాంతా! నేను మీ దగ్గరికి ఒక స్నేహితుణ్ణి వెంటబెట్టుకొచ్చాను. ఈయన పేరు కుమాలో. ఇన్‌డాట్ షేసి నుంచి వచ్చాడు."

"రండి, రండి మిత్రులారా లోపలికిరండి. మిస్టర్ కుమాలో, మీరాకవల్ల నాకెంతో ఆనందంగా ఉంది. మీరు జోహాన్సుబర్గుకు రావడం ఇదే మొదటిసారా?"

కుమాలో జాబులేమీ చెప్పలేకపోయాడు. తను సురక్షితంగా చేరవలసినచోటుకు చేరాడు. తగిన మర్యాద, గౌరవం లభించాయి. అదే అతనికి కావలసింది. అతనెంతో సంతృప్తిగా మాట్లాడాడు.

"నేను చాలా అయోమయంలో పడిపోయాను. కాని ఈ మిత్రుడు నాకెంతో సహాయంచేశాడు. ఇతని ఋణం తీర్చుకోలేను." అన్నాడు.

"అదృష్టవశాత్తూ తగిన వ్యక్తే మీకు లభించాడు. వీరు మిస్టర్ మసాలో. మనకు సంబంధించిన పెద్ద వ్యాపారస్తుల్లో ఒకరు; అంతే కాదు. వీరు మన చర్చిని సేవించే భక్తుల్లో ఒకరు"

"కాని ఏం లాభం? నేను తటస్థపడక మునుపే ఆయనకు జరిగవలసిన దంతా జరిగింది." అన్నాడా వ్యాపారస్థుడు.

ఇలా అంటూ జరిగిన కథంతా—కుమాలోను ఒక యువకుడు నౌసంచేసి ఎలా దబ్బుకా జేసిందీ; మొదలైన వివరాలన్నీ చెప్పాడు. అంతావిని సిమాంగు చాలా విచారించాడు జాగ్రత్తగా ఉండవలసిందని కుమాలోకు తగిన సలహాలిచ్చాడు. తరువాత ఇలా అన్నాడు :

"సరే, మిష్టర్ కుమాలో! మీరెంతో ఆకలిగొని వుంటారు. లేవండి, భోజనం చేద్దురుగాని. మిష్టర్ మసాలో! మీరుకూడా ఇక్కడే మాతోపాటు భోజనం చెయ్యరూ?"

కాని మసాలో భోజనానికి ఉండలేదు. అతను వెళ్ళగానే సిమాంగు తలుపువేసి వచ్చాడు. కుమాలో ఒక పెద్ద కుర్చీలో స్థిమితంగా కూచున్నాడు. సిగరెట్టు కాల్చడం తన ఆచారం కాకపోయి నప్పటికీ కాల్చడానికి అంగీకరించాడు. గదిలో ప్రకాశవంతంగా దీపాలు వెలుగుతున్నాయి. ఊపిరి సలపకుండా చేసే నగరం ఇప్పుడు వేరైపోయింది. కుమాలో ఒక పసిపిల్లకాయకుమల్లే కులాసాగా సిగరెట్టుకాల్చుకుంటూ కూచున్నాడు. ప్రయాసతో కూడుకున్న తన దూరపు ప్రయాణంగడిచి గట్టెక్కింది. జోహాన్సు బర్గ్ చేరుకున్నాడు. యువకుడైన ఈ మత గురువంటే తనకెంతో ఇష్టంగా ఉన్నది. తనను ఆహ్వానించి ఆదరించాడు. ఇహ శాస్త్ర పీఠం చూచుకుని వారిరువురు తా మిక్కడ చేయవలసిన పనిని గురించీ, అది జయప్రదంగా ముగించుకునే విషయంగురించీ ముచ్చటించుకుంటారు. ఈ నిమిషాని కతను హాయిగా, సురక్షితంగా ఉండవలసినచోట ఉన్నాడు.

"మీరు పడుకోవడానికి ఒకచోటు చూశాను. మిసెస్ డితెబె అనే వృద్ధురాలు ఒకావె ఉన్నది. నాకు స్నేహితురాలు. చాలా మంచి మనిషి. మనచర్చిలో ముఖ్య సభ్యురాలుకూడా. మీ రావె ఇంట్లో పడుకుంటారు గాని. ఆవిడ సూటో జాతికి చెందినస్త్రీ- కాని జూలూభాష చక్కగా మాట్లాడుతుంది. ఒక మతగురువు తన ఇంటికి రావడం ఆవిడ ఎంతో ఘనంగాను, గౌరవంగాను భావి స్తుంది. చాలా చౌకకూడ- వారానికి మూడు షిల్లింగులు మాత్రమే. మిషన్‌కుచెందిన వ్యక్తులు అక్కడికి వస్తారు. వారితోకలిసి మీరక్కడ భోజనం చేయవచ్చును. సరే, ఇప్పుడు గంట కొట్టారు. మీరు చేతులు కడుక్కుంటారా?"

వారిద్దరూ అధునాతనంగా ఉన్న ఒక ప్రదేశం లోకి వెళ్ళారు. అక్కడొక తెల్లటి బేసిన్‌లో చేతులు కడుక్కున్నారు. అక్కడ చన్నీళ్ళు, వేడినీళ్ళు ఉన్నాయి. తువాళ్లు కొంచెం చిరిగినా తెల్లగా పరిశుభ్రంగా ఉన్నాయి. అక్కడ అధునాతనపద్ధతిలో అమర్చిన స్నానాలగదికూడా ఉంది. అక్కడున్న ఒక చిన్న బుడిపిలాంటిదాన్ని నొక్కితే ఏదో బ్రద్దలయినట్లుగా నీళ్లు ఇవతలకి చిమ్ముతాయి. ఇలాంటి విషయాలనుగురించి ఇంతకుముందు కుమాలో వినక పోతే, నిజంగా ఆయనకు భయం కలిగుండేది.

వారొక గదిలోకి వెళ్ళారు. అక్కడొక టేబిల్ వేసి ఉంది. చాలామంది మతగురువులు అక్కడ ఉన్నారు- తెల్లవాళ్లు, నల్లవాళ్లుకూడా.

ప్రార్థన చేసుకున్న తరువాత అందరూ కలిసి భోజనానికి కూచున్నారు. సారితో పాటు అతనూ కూచున్నాడు. అంత మంది అపరిచితులతో కలసి భోజనానికి కూచోడం, అన్ని ప్లేట్లు, చాకులు, ఫోర్కులు; ఇదంతా చూచి అతను కొంచెం గాభరాపడ్డాడు. అక్కడ ఎలా ప్రవర్తించాలో కూడా అతనికి తెలిసింది కాదు. కాని పక్కనవారంతా ఏం చేస్తున్నదీ గమనించాడు. వా రెలా చేస్తే తనూ అలాగే చేశాడు. భోజనాలు పూర్తి అయినవి.

అతనొక యువకుని ప్రక్కన కూచున్నాడు. అతని వి గులాబీరంగు చెక్కిళ్లు అతను ఇంగ్లండునుంచి వచ్చిన మతగురువు. ఆ యువకుడు కుమూలోను ఆయన ఎక్కడ నుంచి వచ్చిందీ, అక్కడ పరిస్థితులెలా ఉండేదీ మొదలైన విషయాలన్నీ అడిగాడు. అంతలో మరో స్త్రీ మతగురువు కూడా తనవిషయం ఇలా చెప్పాడు:

"నేనుకూడా ఇక్ హాపోనుంచే వచ్చాను. మా అమ్మగారు నాన్నగారు ఇంకా అక్కడ జీవించి ఉన్నారు. లుఫాఘాకొండ లోయలో వారి నివాసం అక్కడ పరిస్థితి ఎలా ఉంది?"

అతను వారితో ఈ ప్రదేశాలన్నింటినీగురించి చెప్పాడు. దూరదేశమైన ఆ ప్రాంతాలను గురించీ, ఆ పెద్ద పెద్ద కొండలను గురించీ, లోయలను గురించీ అంతా చెప్పాడు. వాటన్నిటినీ అతనెంతగా ప్రేమిస్తున్నాడో అతని కంఠస్వరంలో అభివ్యక్తమవుతోంది. వారంతా నిశ్శబ్దంగా అతను చెప్పిన వన్నీ విన్నారు. అతనింకా చాలా చాలా చెప్పాడు. ఆ దేశా

నికి పట్టుకున్న దరిద్రాన్నిగురించి చెప్పాడు. అక్కడ భూమి ఎంత నిస్సారమైపోయిందో చెప్పాడు. నేలమీద పచ్చని గడ్డిపోచ అయినా కనిపించదనీ, కొండల్లోనుంచి లోయల్లోకి, లోయల్లోనుంచి కొండల్లోకి వాగులు ప్రవహిస్తుంటాయనీ, ఇప్పుడా ప్రాంతంలో ఉండేదల్లా కాటికి కాళ్లు చాచుకొన్న స్త్రీ పురుషులు, రెక్కలురాని పసిపిల్లలు మాత్రమేననీ చెప్పాడు. జొన్నపైరు మనిషెత్తుకూడా పెరగదని చెప్పాడు. అంతేకాదు, ఆ తెగవాగంతా ఎలా తెగి వేరైపోయిందీ, ప్రతి ఇల్లూ ఎలా గుల్లయిపోయిందీ, ప్రతిమనిషీ ఎలా పాడైపోయిందీ చెప్పాడు. వారంతా అక్కడనుంచి తరలి వెళ్ళారనీ; చెల్లాచెదరై పోయారనీ చెప్పాడు. వారిలో చాలామంది తిరిగి రానేలేదన్నాడు. చాలామంది ఎక్కడున్నదీ—వారిజాడ, జవాబు లేకుండా పోయిం దన్నాడు. ఇది ఒక్క ఇన్‌డాట్ షేనీలో మాత్రమే కాదనీ, లుఘాఘాలో, ష్లావినీలో, ఉమ్‌కోమాస్‌లో, ఉమ్ జిమ్‌కూలూలో మొదలైన అన్నిప్రాంతాలకూ ఇదే దుర్గతి పట్టిందనీ చెప్పాడు. అయినా గెర్ట్రూడ్‌ను గురించికాని, అబ్‌సాలమ్‌ను గురించికాని ఒక్కమాటయినా చెప్పలేదు.

ఇలా వారంతా ఆ దేశపు దౌర్భాగ్య స్థితినిగురించి మాట్లాడుకున్నారు. ఆ జాతి విచ్ఛిన్నమైపోవడాన్నిగురించి, ప్రతి ఇల్లు, ప్రతి కుటుంబం కూలిపోవడం గురించి చెప్పుకున్నారు. వయసు కుర్రవాళ్లు, పడుచుపిల్లలు అక్కడనుంచి వెళ్ళిపోయి తమ ఆచారాలను, ఆప్తులను విస్మరించి విచ్చలవిడిగా, వ్యర్థంగా ఎలా జీవిస్తున్నారో చెప్పుకున్నారు.

నేరస్థులయిన చిన్నపిల్లలను గురించి, ఇంకా ప్రమాదకర మైన నేరాలుచేసిన పెద్దవారినిగురించి చెప్పుకున్నారు. తెల్ల వారుండే జోహానసుబర్గు నగరం నీగ్రోల నేరాలకు ఎలా భయ విచలితమైపోతున్నదో మాట్లాడుకున్నారు. వారిలో ఒకరువెళ్ళి ఒకవార్తా పత్రిక తెచ్చి అతనికిచ్చారు. ఆ పత్రిక పేరు జోహానసుబర్గు మెయిల్. ఇంతింతలావు నల్లటి అక్షరాలతో అచ్చువేసి ఉన్న ఈ విషయం అతనికి చూపించాడు.

ఒంటిగా ఉన్న గృహంలో వృద్ధ దంపతులను కొట్టి దోచుకున్నారు. నలుగురు స్వదేశస్థులు అరెస్టు చేయబడ్డారు.

"ఇంచుమించు ప్రతిరోజూ ఇలాగే జరుగుతుంటుంది. ఈ భయపడేది కేవలం యూరోపియన్లు మాత్రమే కాదు. ఇక్కడ—ఈ సోఫియా టౌన్‌లో ఉన్న మేంకూడా భయ పడుతున్నాం. ఇటీవలె ఒక సంఘటన జరిగింది. ఈ యువకుల గుంపంతా వెళ్ళి మనజాతికి చెందినపిల్ల—ఒక ఆఫ్రికన్ల అమ్మాయిమీదపోయి పడింది. వాళ్ళు ఆ అమ్మాయి సంచీ లాక్కున్నారు. డబ్బు కాజేశారు. ఇంక కొంచెం సేపట్లో ఆ పిల్లను చెరిచేవారు కూడా. కాని అంతలో ఆ ఇళ్ళల్లోఉండే జనం పరుగెత్తుకుంటూ రాబట్టి సరిపోయింది." అని చెప్పాడు పత్రిక తెచ్చిన వ్యక్తి.

"ఇక్కడ జోహానసుబర్గులోఉండే మీకింకా బోలెడు విషయాలు తెలుస్తాయి." అన్నాడు గులాబీ చెక్కిళ్లుగల గురువు. "ధ్వంసమైపోయిందల్లా ఒక్క మీ ప్రాంతమే కాదు. కాని మనం మళ్ళీ మాట్లాడుకుందాం. మీ దేశాన్ని

గురించి మరో తడవ నాకు పిలవాలని వుంది. కాని ఇప్పుడు నేను వెళ్ళాలి" అన్నాడు.

తరువాత వారంతా అక్కణ్ణుంచి లేచారు. కుమాలోను తన స్వంత గదిలోకి తీసుకెడతానని సిమాంగు వారితో చెప్పాడు.

"మనం మాట్లాడుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి" అన్నాడతను.

వారిరువురు గదిలోకి వెళ్ళారు. సిమాంగు తలుపు మూసివచ్చాడు. ఇరువురూ ప్రక్కప్రక్కనే కూచున్నారు. కుమాలో ఇలా అన్నాడు :

"మీరు నన్ను క్షమించాలి. నేను తొందరపడుతున్నానని అనుకుంటున్నారేమో. కాని నా చెల్లెలి విషయం తెలుసుకోవాలని నాకెంతో ఆత్రుతగా ఉంది"

"అవు నవును." అన్నాడు సిమాంగు. "మీరెంతో ఆతృతపడుతుంటారని నాకు తెలుసును. నేను అనాలోచితంగా ఉన్నానని మీరు భావిస్తున్నారేమో. కాని ముందుగా ఒక్క విషయం అడుగుతున్నందుకు నన్ను మన్నించండి. ఆవిడ జోహాన్సుబర్గ్ నగరం ఎందుకొచ్చినట్లు?" అన్నాడు.

ఈ ప్రశ్న కుమాలోను కలవరపరచింది. అయినా అతను మెల్లగా, వినయంగా సమాధానం చెప్పాడు:

"ఆవిడ తన భర్తను చూడడానికి వచ్చింది. అతను గనుల్లో పనిచేయడానికి కుదిరాడు. కాని పనిచేయవలసిన

కాలం పూర్తి అయినతర్వాతకూడా తిరిగిరాలేదు. పోనీ పోనీ ఒక్క ఉత్తరంముక్కకూడా వ్రాయలేదు. అతను చచ్చాడో బ్రతికాడోకూడా ఆవిడకు తెలీదు. అంచేత ఆవిడ తన పసిబిడ్డను వెంటతీసుకుని అతన్ని వెదకడానికై వచ్చింది."

సిమాంగు మాట్లాడకపోయేసరికి అతను ఆత్రుతతో మళ్ళీ "ఆవిడకు చాలా జబ్బుగా ఉన్నదా?" అని అడిగాడు.

సిమాంగు గంభీరంగా జవాబుచెప్పాడు: "అవును. ఆవిడ చాలా జబ్బుగా ఉన్నది. కాని ఆజబ్బు మన మామూలు రకానికి చెందినదికాదు. అది మరోరకమైన జబ్బు—చాలా పాడు జబ్బు. నేను మీకోసం కబురుచేయడానికి కారణం మొదటిది: ఆవిడ ఒంటరిగాఉన్న ఆడమనిషి కావడం. రెండవది: ఆవిడ అన్నగారైన మీరు మతగురువై ఉండడం. ఆవిడ తన భర్తను ఎన్నడైనా చూచిందో లేదో నాకు తెలీదు. కాని ఆవిడ కిప్పుడు భర్తఅంటూ లేడు."

ఇలా అని అతను కుమాలోవంక చూచాడు. మళ్ళీ ఇలా అన్నాడు: "సత్యం చెప్పాలంటే ఆవిడకు అనేకమంది భర్తలున్నారు."

"అయ్యో భగవంతుడా! అయ్యో భగవంతుడా!" అన్నాడు కుమాలో.

"ఆవిడ క్లేర్ మాంట్ లో నివసిస్తున్నది. ఆ ప్రదేశం ఇక్కడికేమంత దూరంకాదు, జోహానసుబర్గు నగరంలోని

పాడు ప్రదేశాల్లో అది ఒకటి. పోలీసులను పెట్టిన తరువాత కూడా అక్కడ వీధుల్లో సారాయి కాలువలు కడుతూ ఉన్నదంటే నమ్మండి. అక్కడ అడుగుపెడితే చాలు సారా కంపు తప్ప మరింకేమీ ఉండదు. ఆ పేటల్లో ఎక్కడికైనా వెళ్ళండి అంతా ఇదే వరస."

అతను కుమాలో మీదికి కూడా వొంగాడు: "నేను కూడా సారాయి తాగేవాణ్ణి. కాని అదిచాలా మంచిరకం సారాయి. మన తండ్రులు తయారుచేసిన లాంటిది. కాని ఇప్పుడు నేను ఇహ ఎన్నడూ సారాయి ముట్టుకోనని ఒట్టు వేసుకున్నాను. ఇక్కడ దొరికేది చాలా పాడు సారాయి. చాలా ఘాటుగా ఉంటుంది. మన జనం ఎన్నడూ ఉపయోగించని నానా రకాల పదార్థాలన్నీ అందులో కలుపుతారు. మీ చెల్లెలు చేసినపని అదే. ఆవిడ దాన్ని తయారు చేస్తుంది, అమ్ముతుంది. ఈ విషయం నా కెంతో బాధకలిగిస్తున్నప్పటికీ నేను మీ దగ్గర ఏమీ దాచడం లేదు. ఈ రకం స్త్రీలున్నారే - వీరు డబ్బుకోసం ఏ పురుషుడి దగ్గరైనా పడుకుంటారు. ఆవిడ ఉండే చోట ఒకతన్ని చంపివేశారు. వారు జూదమాడతారు, తాగుతారు, తన్నుకుంటారు. ఆవిడను రెండుమూడు తడవలు జైల్లోకూడా పెట్టారు." అన్నాడు.

అతను కుర్చీలో వెనక్కు వాలాడు. టేబిల్ మీద ఉన్న ఒక పుస్తకాన్ని ముందుకూ వెనక్కూ కదిలించాడు. "ఇది మీకు చాలా దారుణమైన వార్త అనుకుంటాను" అన్నాడు.

కుమాలో మౌనంగా తల ఊపాడు. సిమాంగు సిగరెట్లు బయటికితీసి "కాలుస్తారా?" అని అడిగాడు.

కుమాలో అక్కర్లేదన్నట్లు తల ఊపాడు: "నిజానికి నేను సిగరెట్లు తాగను." అన్నాడు. "ఒక్కొక్కప్పుడు ఎవరికైనా సిగరెట్లు తాగితే కొంత శాంతి కలుగుతుంది. కాని మనిషిలో వేరేరకమైన శాంతి మరొకటి ఉండితీరాలి. పోతే సిగరెట్లు కాల్చడంవల్ల కొంత కులాసాగా ఉంటుంది. కాని జోహాన్సుబర్గులో ఉన్నదే, మనిషికి మనశ్శాంతి ఉంటుందన్నమాట కల్ల."

"జోహానస్సు బర్గులోనా? ఇక్కడే కాదు. ప్రతి చోటా అంతే. దైవస్వరూపమైన శాంతి ఉన్నదే అది మన అంతరంగాల్లోంచి అదృశ్యమైపోయింది."

తరువాత వారిరువురూ మౌనంవహించారు. ఏ ఒక్క మాట మాట్లాడదామన్నా ఎవరికీ మనస్కరించలేదు. ఇరువురికీ ఏదో కష్టంగానే తోచింది. చివరకు కుమాలో "ఆవిడ పిల్లవాడు ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"అక్కడే ఉన్నాడు. కాని బిడ్డ వుండతగిన స్థలం కాదది. మీకు కబురుచేయడానికి ఇది కూడా ఒక కారణం. ఒక వేళ మీరు తల్లిని కాపాడలేకపోయినా, బిడ్డను కాపాడవచ్చును."

"మీరు చెప్పిన ఈ ప్రదేశం ఎక్కడున్నది?"

"ఇక్కడికి అట్టే దూరంలేదు. నేను రేపు మిమ్మల్ని తీసుకెడతాను."

"నాకు పెద్దవిచారం కలిగించే విషయం మరొకటి ఉన్నది."

"అదేమిటో నాకు చెప్పండి."

"మీతో చెప్పడమంటే నాకెంతో సంతోషం." ఇలా అని కుమారాలో ఊరుకున్నాడు. మాట్లాడడానికి ప్రయత్నించాడు కాని, మాట పెగిలిరాలేదు. అది కనిపెట్టి సిమోంగు ఇలా అన్నాడు.

"నాయనా! మరేం ఫరవాలేదు. నింపాదిగా చెప్పండి."

"చెప్పడం అంత సులభంకాదు. ఇది మాకు తీరని విచారం."

"బహుశా కుమారుడి విషయమా? లేక కుమార్తె విషయమా?"

"కుమారుడు."

"చెప్పండి, వింటున్నాను."

"వాడిపేరు అబ్సాలమ్. నా చెల్లెలిని చూడడానికని వాడూ వచ్చాడిక్కడికి. కాని మళ్ళీ ఇంటికి చేరలేదు. వెళ్ళిన తరువాత ఒక్క ఉత్తరం ముక్కఅయినా వ్రాయలేదు. మా ఉత్తరాలు - వాడి తల్లి వ్రాసినవి, నేను వ్రాసినవి కూడా మళ్ళీ మాకు తిరిగి వచ్చినవి. ఇహ ఇప్పుడు మీరు చెప్పిన విషయం విన్నతరువాత నాకు మరీ భయంగా ఉంది"

"నాయనా! అతనెక్కడున్నాడో తెలుసుకోడానికి ప్రయత్నం చేద్దాం. బహుశా అతని జాడ మీ చెల్లెలికి

తెలిసి ఉంటుంది. మీరు చాలా అలసిపోయారు. మీకు చెప్పిన ఆగదికి తీసుకువెళతాను రండి. అక్కడ విశ్రాంతి తీసుకుందురుగాని."

"అవును అలాగే చేద్దాం."

నా దగ్గరనుంచి లేచారు. కుమాలో ఇలా అన్నాడు :

"చర్చికి వెళ్ళి ప్రార్థనలు చేయడం నా అలవాటు. చర్చి ఎక్కడున్నదో త్రోవచూపుతారా ?"

"మనం వెళ్ళే త్రోవలోనే వున్నది."

కుమాలో మళ్ళీ వినయంగా ఇలా అడిగాడు: "నా కోసం మీరూ ప్రార్థన జరపరూ ?"

"తప్పకుండా. సంతోషంగా జరుపుతాను! నాయనా నా పనులు నాకున్నాయి కాని, మీ దగ్గర ఎంతకాలం ఉంటే అంతకాలం నేను మీ ఆధీనంలోనే ఉంటాను. మీకు ఏం కావాలంటే అది చేసి పెడతాను."

"మీరు దయామూర్తులు."

విధేయతతో మాట్లాడుతున్న కుమాలో కంఠస్వరం సిమాంగును ద్రవింపచేసింది. అతనిలా అన్నాడు:

"నేను దయకలవాణ్ణి కాదు. నేను చాలా స్వార్థపరుణ్ణి. పాపిని. కాని ఆ ఈశ్వరుడు తన హస్తాలు నాపై వుంచాడు– అంతే."

అతను కుమాలో సంచిని తీసి చేత పట్టుకున్నాడు. కాని వాకిలి దగ్గిరికి వెళ్ళకముందే కుమాలో అతన్ని ఆపాడు:

"మరొక్క విషయం మీతో చెప్పాలని ఉంది" అన్నాడు.

"చెప్పండి."

"నాకో తోడబుట్టినవాడు కూడా ఉన్నాడు. వాడూ ఇక్కడే జోహానసుబర్గులో ఉన్నాడు. వాడి జాడకూడా నాకింతమటుకు తెలీదు. వాడి పేరు జాన్ కునూలో. వడ్రంగం పని చేస్తాడు."

సిమాంగు చిరునవ్వు నవ్వాడు.

"అతన్ని నేనెరుగుదును." అన్నాడు. "అతనికి ఉత్తరం ముక్క వ్రాసే తీరుబడికూడా లేదు. మనకు సంబంధించిన గొప్ప రాజకీయవేత్తల్లో అతనూ ఒకడు."

"రాజకీయవేత్తా? నాతమ్ముడా?"

"అవును. రాజ్యాంగ విషయాలు అతనికి తెలిసినట్లుగా మరెవ్వరికీ తెలియవు."

ఇలా అని సిమాంగు ఒక్క క్షణం ఆగాడు. మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు: "ఇంకా మీ మనస్సును నొప్పించాలని నాకు లేదు. ఇహ మీ సోదరుడు చర్చికి ఏమాత్రం ఉపయోగపడడు. 'దక్షిణాఫ్రికా కోసం దేవుడు ఏదైతే చేయలేదో అది మనిషి చేస్తాడు' అని చెపుతాడతను."

"చాలా పాడు ప్రాయాణం నాది."

"అవును. నాకు తెలుసును."

"ఒక్కొక్కప్పుడు నాకు భయంవేస్తుంది.— బిషప్ వింటే ఏమంటాడు? తన మతగురువుల్లో ఒకడిలా అయి పోయాడని... ..."

"ఏమంటాడు బిషప్? ఏ బిషప్పూ ఆపలేని విషయా లేవేవో జరుగుతున్నాయి. ఈ విషయాలు జరగకుండా ఆపడం ఎవరికిసాధ్యం? ఇవిలా జరిగిపోతుండాల్సిందేనా?"

"అవును. జరిగిపోతుండవలసిందే" అన్నాడు సిమూంగు గంభీరంగా. "కాలగమనాన్ని మనమెవ్వరం ఆపలేము నాయనా! నేనూ క్రైస్తవుణ్ణే. తెల్లజాతివాణ్ణి ద్వేషించడమనేది నా కేకోశానా లేదు. నాతండ్రిని అంధ కారంలోనుంచి బయటపడేసినవాడు తెల్లవాడు. కాని మీతో ఉన్నది ఉన్నట్లు మాట్లాడుతున్నందుకు నన్ను మన్నించండి. విషయాలు చెడిపోయినందుకు కాదు దుఃఖం. ఈ విషయాలు మళ్ళీ బాగుపడవు, అదేదుఃఖం. తెల్లవాడు జాతిని విచ్ఛిన్నం చేశాడు. ఇలా అంటున్నందుకు క్షమిం చండి — ఈ జాతిని మళ్ళీ బాగుపరచలేం. ఇది నా నమ్మకం. కాని మీరు చెప్పిన- కొంపలు, కుటుంబాలు కూలిపోయి, ఎవరి త్రోవనవారు చెల్లాచెదరై పోవడమున్నదే అవన్నీ దుఃఖకరమైన విషయాలు. అంచాతనే చిన్న పిల్లలు చట్టాన్ని అతిక్రమించారు. వృద్ధులైన తెల్లవాళ్ళను దోచుకుంటున్నారు, కొడుతున్నారు."

అతను నుదుటిమీద చేత్తోరుద్దుకుని మళ్ళీ గంభీ రంగా ఇలా చెప్పడం మొదలుపెట్టాడు:

"జాతిని విచ్ఛిన్నం చేయడానికి తెల్లవాడికి తగి పోయింది. కాని ఆ విచ్ఛిన్నమైనచోట — ఏదోవిధంగా దాన్ని మళ్ళీ బాగుచేయడం అతని చాతకాలేదు. ఈ విషయాన్ని గురించి నేను గంటలతరబడి తీవ్రంగా ఆలోచించాను. ఇది ముమ్మాటికీ సత్యమని నాకనిపించింది. అయితే అందరూ అలాంటివాళ్ళు కాదు. చెడిపోయిన విషయాన్ని మళ్ళీ బాగుచేయడంకోసం తమజీవితాలను ధారపోసిన తెల్లజాతివాళ్ళు కొందరున్నారు."

"కాని వారుచాలరు" అన్నాడతను. "వాళ్ళు భయపడినమాట సత్యం. ఈ భూమిని భయం పరిపాలిస్తున్నది."

క్షమాపణ చెప్పాలనుకుంటున్నట్లుగా అతను నవ్వాడు: "మాట్లాడాలంటే ఈ విషయాలు చాలాఉన్నాయి. ఇది తరుణంకాదు. ఎంతో ప్రశాంతంగానూ, ఓర్పుతోను మాట్లాడుకోవలసిన విషయాలివి. పాదరి విన్సెంట్‌తో మాట్లాడితే మీకీ విషయాలన్నీ ఇంకా బాగా అవగతమవుతాయి. ఆయన తెల్లవాడు. ఈ విషయాలన్నీ బాగా శోధించినవాడు. మీ దేశాన్ని గురించి తెలుసుకోవాలని ఆయనెంతో కుతూహలపడుతున్నాడు."

"ఆయన నాకు జ్ఞాపకమే."

"వాటివల్ల మనకు ప్రయోజనం బహుస్వల్పం" అన్నాడు సిమాంగు విచారంగా. "వాటివల్ల మనకొచ్చే దేమీలేదు. సరే. రండి, చర్చికివెడదాం"

"మిసెస్ డితెబె! మీఇంటికి నా స్నేహితుణ్ని తీసుకొచ్చాను. ఈయనపేరు రెవరెండ్ స్టీఫెన్ కుమాలో"

"దయచేయండి ఉమ్ఫున్డీస్. మా ఇంట్లో గది చిన్నది. కాని పరిశుభ్రంగా ఉంటుంది."

"మంచిదమ్మా."

"నమస్కారం నాయనా. ఇహా నేను వెళ్ళొస్తాను. రేపు ఏడుగంటలకు చర్చిదగ్గరికివస్తాను. అక్కడ కలుస్తావుకదూ!"

"తప్పకుండా."

"ఆ తరవాత మిమ్మల్ని భోజనానికి తీసుకెళతాను. సరే. సుఖంగా విశ్రాంతి తీసుకో నాయనా. మిసెస్ లితెబే! నే వెళ్ళొస్తానమ్మా."

"మంచిది నాయనా."

"మంచిది ఉమ్ఫున్డీస్."

ఆవిడ కుమాలోను పరిశుభ్రంగాఉన్న ఒక చిన్న గదిలోకి తీసుకెళ్ళింది. అక్కడొక కొవ్వొత్తి వెలిగించి పెట్టింది.

"మీ కేమైనా కావలసివస్తే నన్ను అడగండి; ఉమ్ఫున్డీస్."

"సంతోషం. చాలాకృతజ్ఞతలమ్మా."

"ఇహా నేను వెడతాను. సుఖంగా నిద్రపోండి."

"మంచిది, వెళ్ళిరా అమ్మా."

అతను గదిలో ఒక్క నిముషంపాటు నిలుచున్నాడు. ఇప్పటికి నలభై ఎనిమిది గంటల క్రితం ఎక్కడో బహు దూరంలో ఉన్న ఇన్డొట్షేనిలో తనూ, తన భార్యా తన ప్రయాణంకోసం సామానుసర్దుతూ సంచీ మూటకట్టు

కుంటున్నారు. ఇరవై నాలుగు గంటల క్రితం తాను రైల్లో ఉన్నాడు. కానని దేశంలోగుండా మోతలు పెడుతూ ఉన్న రైల్లో కూచుని ప్రయాణం సాగించాడు. మరి ఇప్పుడూ? బయట ఇసుక వేస్తే రాలని జనం. ఒకటే సందడి. ఆ సందడి అవతల చెవులు గింగుర్లు పుట్టేటట్టు ధ్వనిచేస్తున్న మహా నగరం జోహానసుబర్గు. జోహానసుబర్గు.

ఈ విషయం ఎవరైనా నమ్మగలరా?

౬

అక్కడికి క్లేర్‌మాంట్ ఎంతో దూరం లేదు. సోఫియాటౌన్, క్లేర్‌మాంట్; రెండూ ప్రక్క ప్రక్కనే ఉన్నాయి. సోఫియాటౌన్‌లో ఎవరైనా స్వంత ఆస్తిపాస్తులు సంపాదించుకోవచ్చును. ఇది పశ్చిమదిక్కున స్వదేశీయుల పట్టణభాగం. ఇది జోహానసుబర్గు మునిసిపాలిటీకి చెందినదే. ఇహ ఈ మహా నగరంలో కల్మషమంతా గూడుకట్టుకుని ఉన్న ప్రాంతం క్లేర్‌మాంట్. ఈ మూడింటికీ పశ్చిమదిశన న్యూలాండ్సు అనే యూరోపియన్ జిల్లా, తూర్పువైపు యూరోపియన్‌లకు చెందిన వెస్ట్‌డేన్ జిల్లా.

"విచారించవలసిన విషయం." అన్నాడు సిమాంగు. "విడిపోవాలని కోరుకునే మనిషిని కాదునేను. కాని విచారించవలసిన విషయమల్లా ఏమిటంటే, మనం విడిపోయి లేం. నగరం మధ్యనించి ట్రాంబండ్లు నడుపుతారు. కాని కొన్ని బండ్లు యూరోపియన్‌లకు, కొన్నిబండ్లు మనకు ప్రత్యేకించారు. అయినా వీధుల్లో అల్లర్లు హత్యలు చేసే రౌడీలగుంపు

వచ్చి మన జాతివాళ్ళమీద దౌర్జన్యం సాగిస్తుంది. మన వాండ్లను తరుచు ట్రాంబండ్లలోనుంచి బయటికి గెంటు తారు. ఇహ అప్పుడు మనవాండ్లకు చెందిన కుర్రకారు రౌడీ గుంపంతా వాళ్ళమీద కొట్లాటకు సిద్ధమవుతుంది."

"మరి అధికార్లు లేరూ? వాళ్ళలా జరగనిస్తారా?"

"జరగనివ్వరు. కాని ప్రతి ట్రాంబండినీ కనిపెట్టి ఉండడం వాళ్ళకు సాధ్యంకాదు కదా! దెబ్బలాట అల్లుక పోతుంది. ఆ తరువాత అది ఎలా మొదలైందో కనిపెట్టడం ఎవరి తరం? ఎవరు నిజం చెప్పుతారు? మనమంతా విడి పడి పోయినా బాగుండేది. చూడండి! ఆ పెద్ద భవంతి కని పిస్తోందా?"

"ఆ."

"ఆ భవంతిలోనే 'బాంటూ ప్రెస్' ఉంది. అదే మన వార్తాపత్రిక. అయితే ఆ 'ప్రెస్సు'లో యూరోపియన్‌లు కూడా ఉన్నారు. ఈ పత్రిక ఏదో కొంత మితవాదిగా ఉం టుంది. చెప్పతగిన విషయమంతా చెప్పదు. మీ తమ్ముడు జాన్ ఉన్నాడే-అతనికి 'బాంటూ ప్రెస్'ను గురించి ఏమంత సదభిప్రాయంలేదు. అతనూ అతని స్నేహితులు కూడా 'బాంటూ ప్రెస్'ను 'అభిప్రాయాలను అణగద్రొక్కే-ప్రెస్సు' అని పిలుస్తారు."

ఇలా వారిరువురూ నడుస్తూ వెళ్ళి క్లేర్‌మౌంట్ చేరు కున్నారు. ఆ ప్రదేశం చూచేసరికి కుమాలో అదిరిపడ్డాడు. ఇంటిమీద ఇల్లున్నది. వీధులన్నీ మురికితో కాల్వలు కడు

తున్నాయి. అంతా అసహ్యం. దుర్గంధం. అతను నిర్ఘాంత పోయాడు.

"అక్కడొక స్త్రీ ఉన్నది చూచావా నాయనా?"

"ఆ, చూచాను."

"ఆవిడ ఒక మహారాణి అంటే నమ్మండి. సారా అమ్మేవారిలో ఆవిడ సమ్రాజ్ఞి. జోహానసుబర్గులో ఉన్న మన వాళ్ళందరిలోకీ ఆవిడ శ్రీమంతురాలని చెపుతారు."

"మరి ఈ పిల్లలెవరు? వీళ్ళు బడికి వెళ్ళకుండా ఇక్కడున్నారెందుకు?"

"ఎందుకంటే కొందరికి బడి అంటే లక్ష్యమే లేదు. మరికొంతమంది పిల్లలకు తల్లిదండ్రుల అదుపాజ్ఞలు లేవు. వారు పట్టించుకోరు. ఇంకా చాలామంది ఎందుకు వెళ్ళరూ అంటే స్కూళ్ళలో ఖాళీ లేదు"

వారు లిల్లీస్ట్రీట్‌లోకి వెళ్ళారు. అక్కడనుంచి మలుపుతిరిగి హియాసింత్ స్ట్రీట్‌లోకి వెళ్ళారు. వీధులు అసహ్యంగా ఉన్నా వీధుల పేర్లు మాత్రం ఎంతో ముచ్చటగా ఉన్నాయి.

"ఇక్కడే మీ చెల్లెలుండేది. పదకొండవ నెంబరు ఇల్లు. మీరొక్కరూ లోపలికి వెడతారా?" అని అడిగాడు సిమాంగు.

"ఒక్కణ్ణే వెళ్ళడమే మంచిది."

"సరే. నేనీ ప్రక్కవాకిలిదగ్గరే ఉంటాను. పదమూడవ నెంబరు ఇల్లు. ఆ ఇంట్లో మన చర్చికిచెందిన స్త్రీ

ఒకావిడ ఉంది. చాలా మంచి మనిషి. ఆవిడ, ఆవిడభర్త కలిసి పిల్లలను సాకుతూ వారికి విద్యాబుద్ధులు చెప్పించడానికి పాటుపడుతున్నారు. కాని చాలా కష్టంలో ఉన్నారు. వాళ్ళ పెద్దమ్మాయికి నేను మరం ఇప్పించే ప్రయత్నంలో ఉండగా ఆపిల్ల ఇంట్లోంచి పారిపోయింది. పసిపాటా లేక వీధులు తిరిగే ఒక కుర్రవెధవను జతచేసుకుని పిమ్మిలిలో కాపుర ముంటున్నంది. సరే నాయనా, మీపని పూర్తి కాగానే ఆ వాకిలిదగ్గరకువచ్చి తలుపు తట్టండి, నేనక్కడే ఉంటాను.”

అతను చూపించిన పదకొండవనెంబరు ఇంటిదగ్గరికి వెళ్ళాడు కుమారో. ఇంట్లోనుంచి నవ్వు వినిపిస్తోంది. అదొక వికృతమైన నవ్వు. విన్నవారలకు గుండెలు గుభిల్లుమనే నవ్వు. భయపడని వారినైనాసరే భయపెట్టే పాడు నవ్వు. భయపడినవారిని ఇంకా భయపెట్టే పాడునవ్వు. ఒక స్త్రీ కంఠస్వరం, పురుషుల కంఠస్వరాలు వినవస్తున్నాయి. అయినా అతను తలుపు తట్టాడు. ఆవిడ తలుపు తెరిచింది.

“నేను నమ్మాయ్ నేను, నీ అన్నను.”

ఆవిడ కళ్ళల్లో భయం మెదిలింది. ఒక్క అడుగు వెనక్కువేసింది. అతన్ని సమీపించకుండా అలాగే నిలబడిపోయింది. కొంతసేపు ముఖం అటుతిప్పి ఏదో చెప్పింది. అది అతనికి వినిపించలేదు. వెంటనే కుర్చీలు అక్కడనుంచి తీసివేశారు. తక్కిన వస్తువులుకూడా సర్దివేశారు. ఆవిడ అతని వైపు మళ్ళింది.

“గది సర్దిస్తున్నాను అన్నయ్యా” అన్నది.

వారిరువురూ అలాగే నిలుచుని ఒకరిముఖంలోకి ఒకరు చూచుకున్నారు. అతని చూపుల్లో ఆతృత, ఆవిడ చూపుల్లో భయం. ఆవిడ వెనక్కు తిరిగి గదిలోకి చూచింది. ఒక తలుపు మూసుకున్నది. అప్పుడావిడ అన్న వంకతిరిగి,

"రా, అన్నయ్యా" అన్నది.

అప్పుడుమాత్రమే ఆవిడ తన చెయ్యి అతనికి అందించింది. ఆ చెయ్యి తడిగా, చల్లగా, కొయ్యబారిపోయి ఉన్నది. ఆ చేతిలో ప్రాణంలేదు.

వారిరువురూ కూచున్నారు. ఆవిడ తన కుర్చీలో మౌనంగా ఉండిపోయింది.

"నేను వచ్చానమ్మాయ్" అన్నాడతను.

"మంచి దన్నయ్యా" అన్నదావిడ.

"నీవు ఒక్క ఉత్తరంముక్కఅయినా వ్రాయలేదు."

"అవును. వ్రాయలే దన్నయ్యా"

"నీభర్త ఎక్కడున్నాడు ?"

"అతను నాకు కనిపించలే దన్నయ్యా"

"కాని ఉత్తరం ఎందుకు వ్రాయలేదు?"

"నిజమే నన్నయ్యా వ్రాయలేదు."

"మేమెంతో తహతహలాడుతుంటామని నీకు తెలియదూ ?"

"ఉత్తరం వ్రాయడానికి డబ్బులేదు."

"ఒక్క స్టాంపు కొనడానికి నీదగ్గర రెండు పెన్నీలే లేకపోయినాయూ ?"

అందుకావిడ సమాధానం చెప్పలేదు అతని వంక చూడనుకూడా చూడలేదు.

"మరి నీవు ధనికురాలవని విన్నానే!" అని అడిగాడు మళ్ళీ అతను.

"లేదు. నేను ధనికురాలను కాదు."

"నీవు జైల్లో పడ్డావనికూడా విన్నాను."

"అవును. అది నిజమే."

"సారాయి అమ్మినందుకేనా!"

ఆవిడలో ప్రాణం లేచివచ్చింది. ఆవిడ ఏదో ఒకటి చెయ్యాలి. అలా మౌనంగా, మొద్దులా ఊరుకోలేదు. తను నిర్దోషినని అతనితో చెప్పాలి. ఆవిడతోపాటు ఆ ఇంట్లో మరో స్త్రీ ఉంది.

"నీవు ఆవిడదగ్గర ఉంటున్నావా?" అని అతను అడిగాడు.

"అవును"

"అలాంటి స్త్రీతో నీవెందుకుంటున్నావు?"

"నాకు మరోచోటు లేదన్నయ్యా."

"అయితే ఆవిడ వ్యాపారంలో నీవూ ఆవిడకు సహాయం చేస్తున్నావన్నమాట?"

"పిల్లవాడికోసం నాకు డబ్బుకావాలి."

"పిల్లవాడెక్కడున్నాడు?"

ఆవిడ అనిశ్చితంగా చుట్టూ చూచింది. మెల్లగా లేచి పెరట్లోకి వెళ్ళింది. పిలిచింది. కాని ఒకప్పుడు కమ్మగా

వినసొంపుగా ఉండే ఆ కంఠస్వరం ఇప్పుడు మారిపోయింది. ఆ స్వరంలో ఏదో కొత్తదనం - ఇందాక తను విన్న నవ్వు లాగా భయంకరమైన దేదో వచ్చినట్లు విన్నంతమాత్రానే అతను గ్రహించుకున్నాడు. ఆవిడ మళ్ళీవచ్చి అతనితో చెప్పసాగింది:

"పిల్లవాడికోసం మనిషినిపంపాను." అన్నది.

"ఎక్కడున్నాడు వాడు?"

"వెదకాలి." అని ఆవిడ సమాధానం చెప్పింది.

ఆవిడ కళ్ళలో ఏదో కష్టం కదులాడింది చేతివేళ్ళను గోడమీద ఆడిస్తూ నిలుచుంది. అతనిలో కోపం వెల్లు బికింది.

"నే నెక్కడ పడుకోను?" అని అడిగాడు.

ఇప్పుడావిడ కళ్ళల్లో భయం స్పష్టంగా అగుపించింది. ఇహ తన విషయం దాపరికం లేకుండా చెప్పదలుచుకున్నది. కాని అతనికోపం పట్లు తప్పిపోయి, ఉధృతమై ఉరుకులు పెట్టింది. ఆవిడ చెప్పేదాకా అతను వేచిఉండలేక పోయి నాడు.

"నీవు మమ్మల్లను తలవొత్తకండా చేశావు." అన్నాడు మెల్లగా. ఎవరైనా వినిపోతారన్న భయంతో చాలానెమ్మ దిగా మాట్లాడాడు: "నీవు సారాయి అమ్మేదానివి. పడుపు కత్తెవు. నీకో బిడ్డవుంటే వాడెక్కడున్నదీ కూడా నీకు తెలీదు. నీ అన్ననైన నేను మతగురువును. ఇంతటి నీచ స్థితిని మాకెలా తెచ్చిపెట్ట గలిగావు!"

ఆవిడ అతనివంక చిరచిర లాడుతూ, దెబ్బతిన్న జంతువులాగా చూచింది.

"నేను నిన్ను ఇంటికి తీసుకవెళ్ళడానికి వచ్చాను." అన్నాడతను.

ఆవిడ క్రిందపడి ఏడ్చింది. క్రమక్రమంగా ఆవిడ ఏడుపు పెద్దదైంది. ఆవిడకు సిగ్గు, లజ్జ అనేవి లేవు.

"ఎవరైనా వింటారు." అన్నాడతను వెంటనే.

ఆవిడ తన ఏడుపును ఆపుకోవడానికి ప్రయత్నించింది.

"మళ్ళీ మన ఇంటికి వెళ్ళడం నీకిష్టమేనా ?"

ఇష్టమేనన్నట్లు ఆవిడ తలఊపింది. "జోహానసుబర్గులో ఉండడం నాకిష్టంలేదు. ఇక్కడ నాకు విసుగెత్తిపోయింది. పిల్లవాడు కూడా ప్రాణంవిసిగాడు." అన్నది.

"మనమూ్ళ్ళ్ళ రాత్రిగా నీకు ఇంటికి రావాలని ఉందా ?"

అవునన్నట్లు మళ్ళీ ఆవిడ తల ఊపింది. మళ్ళీ ఏడవడం మొదలుపెట్టిందికూడా. "జోహానసుబర్గు అంటే నాకిష్టంలేదు." అన్నది. ఇలా అని అశ్రుపూరిత నయనాలతో అన్నవంక దీనంగా చూచింది. అతని హృదయంలో ఏదో ఆశ రేకెత్తింది. "అన్నయ్యా! నేను భ్రష్టురాలనై పోయాను. మళ్ళీ ఇంటికివచ్చే యోగ్యత నాకులేదు." అన్నది.

అతని కళ్ళల్లో నీళ్ళు నిండాయి. అతని అంతరంగం లోని కరుణ, సాధుత్వం మళ్ళీ మేల్కొన్నాయి. క్రిందపడి ఉన్న చెల్లెలిదగ్గిరికి వెళ్ళి ఆవిడను చేతులతో లేవనెత్తాడు.

కుర్చీలో కూచోబెట్టాడు. ఆవిడ ముఖాన్ని అస్పష్టంగా చేత్తో నిమిరాడు. అతని హృదయం కరుణతో కరిగి పోయింది.

"ఈశ్వరుడు మనలను క్షమిస్తాడమ్మా." అన్నా డతను. "క్షమించకపోవడానికి నే నెవరిని! మనం ప్రార్థన చేద్దాం."

వారిరువురూ నేలమీద మోకరిల్లి దైవప్రార్థన చేశారు. ఇరుగుపొరుగు వారికి వినిపించకుండా నిశ్శబ్దంగా ప్రార్థనచేశారు. అతను చెప్పుతున్న ప్రార్థనలకు తథాస్తు అని అడుగడుగునా అనుకుంటూ ప్రార్థించింది. అతను పూర్తి చేయగానే ఆవిడ ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తూ తన పాపాలన్నీ నివే దించుకున్నది. తనను క్షమించమని వేడుకున్నది. అలా వారిరువురు సమాధాన పరుచుకుని మనశ్శాంతి పొందారు. ఒకరి చెయ్యి ఒకరు పట్టుకుని కూచున్నారు.

"ఇహ ఇప్పుడు నేను నీ సహాయం కోరుతున్నాను." అన్నాడతను.

"ఏమిటది అన్నయ్యా?"

"మన అబ్బాయి. వాణ్ణిగురించి నీవు వినలేదా?"

"విన్నాను అన్నయ్యా. వాడు జోహాన్సుబర్గులో ఏదో ఒక పెద్దచోట పనిచేస్తున్నాడు సోఫియాటౌన్‌లోనే ఉంటున్నాడు. కాని ఎక్కడో నేను నిశ్చితంగా చెప్పలేను. కాని వాడెక్కడుంటున్నదీ కొందరికి తెలుసును. రెండో అన్నయ్య జాన్ ఉన్నాడే-జాన్ కొడుకు, నీ కొడుకు తరుచు కలుసుకుంటూ ఉంటారు. అతన్ని అడిగితే తెలుస్తుంది."

"అయితే నేనతని దగ్గిరికి వెడతాను. సరేనమ్మాయ్ ఇహ ఇప్పుడు నేను మిసెస్. డి తెజే ఇంట్లో నీవు ఉండడానికి ఏదైనా చిన్నగది దొరుకుతుందేమో చూడాలి. నీ దగ్గర సామాను మరీ ఎక్కువగా ఉందా?"

"ఎక్కువ లేదన్నయ్యా. ఇదిగో, ఈ టేబిల్, ఈ కుర్చీలు, ఒక మంచం; ఇంకా కొద్దిగా కుండలు, చట్లు ఉన్నాయి. అంతే."

"సరే, అవన్నీ తీసుకురావటానికి ఒక మనిషిని చూస్తాను. నీవు సిద్ధంగా ఉన్నట్లేనా?"

"ఇదుగో అన్నయ్యా! అబ్బాయి వచ్చాడు."

కాస్త వయస్సు వచ్చిన ఒక అమ్మాయి ఒక చిన్న కుర్రవాణ్ణి వెంటపెట్టుకుని గదిలోకి వచ్చింది. ఆ పిల్లవాడే అతని మేనల్లుడు. వాడు కట్టుకున్న గుడ్డలు చాలా అసహ్యంగా, మురికిగా ఉన్నాయి. ముక్కువెంట చీమిడి కారుతోంది. వాడు తన నోట్లో వేలు పెట్టుకుని కాగిచిప్పల్లాగా విప్పారిన పెద్దపెద్ద కళ్ళతో మామవంక తదేకంగా చూడసాగాడు.

కుమార్ ఆ పసివాణ్ణి ఎత్తుకున్నాడు. ముక్కు శుభ్రంగా తుడిచాడు. వళ్ళంతా నిమురుతూ ముద్దాడాడు.

"ముందిక్కణ్ణుంచి వెడితే పిల్లవాడు బాగుపడతాడు. కాస్త శుభ్రంగా గాలి, అదీ ఉండేచోట ఉంటాడు. బడికి కూడా పంపడానికి వీలుంటుంది."

"అవును. అదేమంచిది." అంటూ ఆవిడ అంగీకరించింది.

"ఇహ నేను వెళ్ళాలి చేయవలసినపని చాలాఉంది." అన్నాడతను.

అతను ఇంట్లోనుంచి ఇవతలికొచ్చాడు. వీధిలోకి రాగానే ఇరుగు పొరుగు మనుష్యులు అతనివంక విచిత్రంగా తేరిపార చూచారు. ఒక మతగురువు అక్కడికి రావడం వారికి వింతగా తోచింది. అతను తన స్నేహితుడున్న చోటుకు వెళ్ళి అతన్ని కలుసుకున్నాడు. జరిగిన విషయమంతా అతనితో చెప్పాడు. తన చెల్లెలిని, ఆవిడ కుమారుణ్ణి, సామానులను వెంటపెట్టుక రావడానికి ఒక మనిషి ఎవరైనా దొరుకుతారా అని అడిగాడు.

"ఇప్పుడు మనం వెళ్ళిపోదాం. మీ పనులు చక్కపడుతున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది." అన్నాడు సిమాంగు.

"నా మనస్సులో ఒకపెద్ద బరువు తీరిపోయింది. ఆ ఈశ్వరుడి కృపవల్ల తక్కినవన్నీ కూడా సఫలం కావాలి. అప్పుడు" అన్నాడు కుమాలో.

ఆ మధ్యాహ్నం అతనొక లారీ మాట్లాడుకుని తీసుకొచ్చాడు. చెల్లెలిని, ఆవిడ సామానులను అందులో ఎక్కించి అక్కడనుంచి తరలించడానికి ఏర్పాట్లు చేశాడు. ఇలా ఆవిడ అక్కడనించి వెళ్ళిపోతూఉంటే ఆ ఇరుగు పొరుగువారంతా గుమికూడారు. జరుగుతున్న విషయంపై చర్చలు సాగించారు. బిగ్గరగా కుండ పగలగొట్టినట్లుగా మాట్లాడుకున్నారు. కొందరీపని మంచిదన్నారు. ఇంకా కొందరు ఇదివిని వికారంగా విరగబడినవ్వారు. సామానుల్తో

సహా చెల్లెలిని ఆవిడ బిడ్డను లారీలో ఎక్కించగానే అతని కెంతో సంతోషం కలిగింది. వారు అక్కడనుంచి వెళ్ళి పోయారు.

మిసెస్ డితెబే వారికొక గది చూపించింది. తల్లికి, కొడుక్కీ భోజనం పెట్టింది. కుమాలో మిషన్‌కు వెళ్ళాడు. ఇహ ఆ రాత్రి వారు భోజనశాలలో ప్రార్థనలు జరిపారు. మతగురువు ప్రార్థనాగీతాలు పాడారు. మిసెస్ డితెబే, గెర్‌ట్రూడ్‌లు ఆయన్ను అనుసరించారు. కుమాలో హృదయం తేలికపడింది. పసిపిల్లవాడి మాదిరి ఉల్లాసంగా ఉన్నాడు. అలాంటి ఉల్లాసం లేక ఎన్నో ఏండ్లయింది. జోహా నసుబర్గులో తను గడిపిన ఒక్క రోజులోనే తెగిపోయిన జాతి తిరిగి ముడిపడ్డది. ఇల్లు, ఆత్మకూడా మళ్ళీ బాగుపడింది.

౭

గెర్‌ట్రూడ్ ఒకప్పుడు భాగ్యవంతురాలయితే కావచ్చును. కాని ఇప్పు డావిడ పేదరాలు. మాసిపోయిన దుస్తులు ధరిస్తోంది. జిడ్డు కారుతున్న నల్లటి అల్లికటోపీ ఒకటి తలకు ధరిస్తోంది. అదిచూస్తే కుమాలోకు సిగ్గుగా ఉంది. అతని దగ్గరఉన్న డబ్బు చాలా స్వల్పం. అయినా ఆవిడ వంటిమీదికి ఎర్రటిదుస్తులు కొన్నాడు. తలకు ధరించడానికి తెల్లని పాగాలాంటిది ఒకటి కొన్నాడు. పిల్లవాడికోసం ఒక చొక్కా, ఒకజత పొట్టి ట్రౌజర్లు, ఊలుతో అల్లిన బనీనులాంటి దొకటి; ఇవికూడా కొన్నాడు. వాడి ముక్కు, మూతి తుడవడానికని మెత్తగాఉండే ఒక జత చేరుమాళ్ళు కూడా కొని తల్లికిచ్చాడు. అతని జేబులో పోస్టాఫీసు ప్యాసు

బుక్కు ఉన్నది. అందులో దాచిపెట్టుకున్న బొపతు పదిపౌను లున్నాయి. స్టౌ కొనుక్కోవడానికని అతను, అతని భార్య కూడబెట్టుకున్న డబ్బు ఇది. ఇంట్లో బొత్తిగా స్టౌ అంటూ లేదని ఎన్నాళ్ళబట్టో కొనుక్కోవాలను కుంటున్నారు. అందరి ఆడవాళ్ళమల్లే అతని భార్యాకూడా ఇంట్లోకి స్టౌ చాలా అవసరమని మరీమరీ చెప్పింది. అతను మతగురువు. వచ్చేజీతం నెలకు ఎనిమిది పౌనులు. మతగురువంటే కాస్త మంచిరకం నల్లటి దుస్తులు వేసుకోవాలి. పొట్ట గడుపు కోవాలి. ఆపాటి జీతంలో ఈ ఖర్చులన్నీ పోను పదిపౌనులు మిగుల్చుకోవడమంటే ఎంతకాలం పడుతుందో, ఎన్నెన్ని అవస్థలు పడవలసి ఉంటుందో ఆలోచిస్తే సులభంగా తెలు స్తుంది. మతగురువు చిహ్నమైన అతను ధరించే కాలర్లు రంగు వెలిసిపోయి అక్కడక్కడ అంచులు నుగ్గునుగ్గు అయి పోయినాయి. అయినా ఏం చేస్తాడు ? కొత్తవి కొనుక్కో వాలంటే మరికొంతకాలం ఆగాలి. విచారకరమైన విషయం ఏమిటంటే, ఆ పదిపౌనులుకూడా ఇవాళో రేపో ఖర్చయి పోతాయి. ఇహ అతను రైలు ప్రయాణం ఎలాచెయ్యాలి ? ఊరికనే రైలెక్కనివ్వరుకదా! పోతే ఆవిడ సామాను. వాటికికూడా ఒకటి రెండుపౌనులు ఖర్చవుతాయి. ఇంకా విచిత్రమైన విషయం— ఇన్నాళ్ళు ఆవిడ ఆ పాడు వృత్తిలో ఉన్నా మిగుల్చుకున్నది పూజ్యం. మరి ఆవృత్తిలో ఎంతో డబ్బువస్తుందని చెపుతారు అంతా.

ఇంటిపనులలో గెర్ట్రూడ్ మిసెస్ డిత్తెబేకు తోడుగా ఉంటున్నది. ఆవిడ అప్పుడప్పుడు కొంచెం

పాడుతూ ఉండడంకూడా అతను వింటున్నాడు. పసిపిల్ల వాడు పెరట్లోకి వెళ్ళి ఆడుకుంటున్నాడు. అక్కడెవరో ఇల్లుకట్టుకుంటూ వదిలిపెట్టిపోయిన చిన్న చిన్న ఇటుక ముక్కలు, కర్రముక్కలు వాడికి ఆటవస్తువులయినాయి. ఈ మహానగరంలోకూడా చక్కగా ప్రొద్దుపొడుస్తోంది. పచ్చగా, వెచ్చగా ఎండ కాస్తోంది. ఇక్కడకూడా చిన్న చిన్న పిట్టలూ, పక్షులు ఉన్నాయి. చిన్నచిన్న పిచ్చుకలు కిచకిచలాడుతూ పెరట్లో ఎగురుతున్నాయి.

అతను తన భార్యకు జాబు వ్రాస్తున్నాడు. తన రైలుప్రయాణం, మహానగరమైన జోహానసుబర్గ్, యువకుడు తన ప్రాను నాశనం కాజేయడం, ఆ కష్టంలేకుండా వెంటనే తను గెర్ట్రూడ్‌ను కనుక్కోవడం, పసిపిల్లవాడి వలన తనకు గలిగిన ఆనందం; మొదలైన విషయాలన్నీ ఉత్తరంలో వ్రాస్తున్నాడు. అన్నిటికన్న ముఖ్యమైన విషయం: తను ఇవాళే తన కుమారుణ్ని వెదకడంకోసం బయలుదేరుతున్నాడు. ఈసంగతికూడా భార్యకు వ్రాస్తున్నాడు. అంతలో వీధిలోనుంచి సిమాంగు వస్తూండడం చూశాడు. వ్రాస్తూవ్రాస్తున్న ఉత్తరంతీసి అవతల పెట్టాడు.

"మీరు తయారుగా ఉన్నారా?" అని అడిగాడు సిమాంగు.

"ఆ సిద్ధంగా ఉన్నాను. ఇప్పుడే నా భార్యకు ఉత్తరం వ్రాస్తున్నాను."

"ఆవిడను నే నెరుగను. అయినా నా అభివందనాలు తెలియచెయ్యండి."

వారిరువురు వీధివెంట నడవసాగారు. ఒకవీధి పైకి, ఒకవీధి క్రిందికి, మళ్ళీ ఒకవీధి పైకి-ఇలా పోయినంత సేపూ కూత వీధులు వస్తున్నాయి. వాళ్లు చెప్పింది వాస్తవం: పైకిపోయేవీధి ఒకటి క్రిందకిపోయేవీధి ఒకటి; ఇలా నడిచిన వీధిన నడవకుండా ఎన్నిరోజులైనా నడవవచ్చును.

"ఇదే మీ తమ్ముడిషాపు. అతని పేరు వ్రాసిఉన్నది చూడండి." అన్నాడు సిమాంగు.

"అవును, కనిపించింది."

"నన్నూ మీతోపాటు రమ్మంటారా ?"

"అవును. మీరూ రావడం మంచిది."

అతని తమ్ముడు జాన్ లోపలకుర్చీలో కూర్చుని మరో ఇద్దరు వ్యక్తులతో మాట్లాడుతున్నాడు.

జాన్ ఇప్పుడు బాగా లావెక్కాడు. ఒకపెద్ద యజమానిలాగా మోకాళ్ళపై చేతులు పెట్టుకుని కూచున్నాడు. వీధిలోనుంచి వచ్చే దీపపు వెలుతురు వారి వీపులమీద పడుతున్నందున ఆ వచ్చినవారి ముఖాలు మసక వెలుతురులో ఉండిపోయినవి. అంచాత జాన్ తన అన్నగారిని గుర్తించ లేదు.

"గుడ్ మార్నింగ్ బ్రదర్." అన్నాడు కుమారాలో.

"గుడ్ మార్నింగ్ సార్." అన్నాడు జాన్.

మళ్ళీ కుమారాలో "గుడ్ మార్నింగ్ బ్రదర్! నేను మీ అన్నను. నీ తోడబుట్టినవాణ్ణి." అన్నాడు.

అప్పుడు జాన్ కుమార్‌లో అన్నగారి ముఖంలో ముఖం పెట్టి చూశాడు. హృదయంలోనుంచి వచ్చే ఆనందంతో చిరునవ్వు నవ్వుతూ లేచి నిలుచున్నాడు.

"నా స్వంత అన్నగారు! ఇది నిజమేనా! నీవిక్కడ-జోహాన్సుబర్గులో ఏం చేస్తున్నావన్నయ్యా?"

కుమార్‌లో అక్కడున్న కొత్తవారివంక చూశాడు. "నేనిక్కడికి పనిమీద వచ్చాను నాయనా" అన్నాడు.

జాన్ తను మాట్లాడుతున్న వారితో "క్షమించండి మిత్రులారా. మా అన్నగారు-నా తోడబుట్టిన తోడు వచ్చాడు." అన్నాడు.

తరువాత ఆ ఇరువురు వ్యక్తులు సెలవు తీసుకుని వెళ్ళి పోయారు.

"రెవరెండ్ సిమాంగును నీ వెరుగుదువా తమ్ముడూ?" అని అడిగాడు కుమార్‌లో.

"బాగుంది బాగుంది; ఆయన్నెరుగని వారెవరున్నారు? రెవరెండ్ సిమాంగు అంటే అందరికీ కొట్టినపిండి. సరే, కూర్చోండి. కొంచెం టీ తాగుదాం."

అతను వాకిలిదగ్గిరకి వెళ్ళి వెనకాల ఉన్నవారిని పిలిచాడు.

"నీ భార్య ఎస్తర్ కులాసాగా వున్నదా తమ్ముడూ?"

జాన్‌కుమార్‌లో కులాసాగా చిరునవ్వు నవ్వాడు. అతనెప్పుడూ అలాగే నవ్వడం అందరూ ఎరిగినదే. "ఈ స్తర్ నన్ను వదిలిపెట్టి వెళ్ళిపోయి పదేండ్లయింది అన్నయ్యా" అన్నాడు.

"అయితే మళ్ళీ పెళ్ళి చేసుకున్నావా ?"

"సరే, సరే మనచర్చి సాంప్రదాయంప్రకారం దాన్ని వివాహమని అనరనుకో. అది నీకు తెలిసిన విషయమే.. కాని ఈవిడ చాలా ఉత్తమురాలు."

"ఈ విషయం మాకేం వ్రాయలేదేం తమ్ముడూ?"

"వ్రాయలేదు. ఎలా వ్రాయను? మీరు-ఇన్‌డాట్ పేసీలో ఉండేవాళ్ళు. జోహాన్నుబర్గులో జీవితం ఎలాంటిదో ఎరుగరు. మీకు తెలియపర్చకపోవడమే మంచిదనుకున్నాను."

"అందుకని ఉత్తరాలు వ్రాయడం మానేశావన్న మాట?"

"సరే, సరే. అందుకే వ్రాయలేదనుకో. కాని గొడవలు, అనవసరమైన గొడవలన్నయ్యా."

"కాని నాకో విషయం అర్థంకావడంలేదు. జోహాన్నుబర్గులో జీవితం వేరన్నావు. ఏమిటా వేరు?"

"సరే, అది తెలియచెప్పడం కష్టం. నేను ఇంగ్లీషులో మాట్లాడితే నీకేం అభ్యంతరం లేదుకదూ? ఇంగ్లీషులో అయితే ఈ విషయాలు ఇంకా విశదంగా చెప్పగలను."

"అయితే ఇంగ్లీషులోనే చెప్పు తమ్ముడూ."

"చూడు! ఇక్కడ జోహాన్నుబర్గులో నాకు బోలెడంత అనుభవముంది. ఇక్కడ ఇన్‌డాట్ పేసీలో లాగా ఉండదు. ఇక్కడ జీవితం అర్థంకావాలంటే ఇక్కడ కొంత కాలం నివసించాలి."

ఇలా అని అతను అన్నవంక చూచాడు. "ఇక్కడేదో విశేషం జరుగుతున్నది" అన్నాడు.

అతను ఒకచోట కూచోలేదు. విచిత్రమైన కంఠస్వరంతో మాట్లాడడం మొదలుపెట్టాడు. గదంతా కలయతిరుగుతున్నాడు. కిటికీలోనుంచి వీధిలోకి చూస్తున్నాడు. ఇంటి పైకప్పు, గది నాలుగుమూలలు పరిశీలిస్తున్నాడు. అక్కడేవో ఉన్నట్లు, వాటిని వెదికి వెలికి తీయాలన్నట్లు కనిపిస్తున్నాడు.

"ఇన్‌డాట్‌పేసీలో ఉన్నవ్వుడు నేనేమిరా కాను. ఒక మనిషికింద లెక్కేకాదు. ఆలోచిస్తే, నిజానికక్కడ నీవుకూడా అంతే అన్నయ్యా. అక్కడ నేనొక జ్ఞానహీనుణ్ణి. ఒక పెద్ద యజమానిచేతిలో ఆటవస్తువును. నేనతనికి నమస్కరించాలి. తల వొంచాలి. కాని ఆ పెద్దకు పొట్టకోసినా అక్షరం ముక్క లేదు. మరి ఇక్కడ, జోహాన్సుబర్గులో ఉంది చూచావ్? ఇక్కడ నాకు కొంత ఘనత, గౌరవం ఉన్నాయి. కొంత ప్రాముఖ్యం, పలుకుబడీ ఉన్నాయి. నాకు నా స్వంత వ్యాపారం ఉన్నది. అది వృద్ధి అయితే, నేను వారానికి పది, పన్నెండు పౌనులు సంపాయించుకో గలుగుతాను."

అతను అటూ ఇటూ ఊగడం మొదలుపెట్టాడు. అతను వారితో మాట్లాడడంలేదు. అక్కడ లేని మనుష్యులెవరితోనో అతను మాట్లాడుతున్నట్లుగా ఉన్నాడు.

"అయితే మేం ఇక్కడ స్వేచ్ఛగా ఉన్నామని నేను అనడం లేదు. మనుష్యులకు కావలసిన స్వేచ్ఛ మా కిక్కడ ఉన్నదని నేను చెప్పడంలేదు. కాని కనీసం నాకు ఒక యజమానినుంచి అయినా విముక్తి ఉన్నది. వృద్ధుడు, అవివేకి అయిన ఒక యజమానినుంచి అయినా కనీసం ఇక్కడ నాకు స్వేచ్ఛ ఉన్నది. వాడు మనిషికాదు, ఒక తెల్లవాడి పెంపుడు

తుక్క. వాడొక వచ్చిమోసగాడు. తెల్లవాడు ఏదో తన గుప్పిట్లో ఉంచుకోవా లనుకున్నట్లుగానే వాడుకూడా మోసంతో ఏదో తన హస్తగతం చేసుకుంటున్నాడు."

ఇలా అని ఆతను మళ్ళీ తన సహజమైన చిరునవ్వు నవ్వాడు. మళ్ళీ ఒక నిముషంపాటు వారి కిలా చెప్పడం మొదలుపెట్టాడు :

"కాని గుప్పిట్లో ఉంచుకోవడం వారికి సాధ్యం కావడం లేదు. తెగ, సమాజం యావత్తూకూడా ఎక్కడ కక్కడ పట్టు తప్పి, సళ్ళొదిలిపోతోంది. ఇక్కడ జోహాన్సుబర్గులో నూతన సమాజం నిర్మింపబడుతోంది. ఇక్కడ ఏదో విశేషం జరుగు తోంది అన్నయ్యా."

అత నొక్క క్షణం ఆగి మళ్ళీ చెప్పసాగాడు :

"మీా మనస్సు నొప్పించాలని నాకు లేదు. కాని ఒక్క విషయం. చర్చి ఉన్నదే - అదికూడా పెత్తనంచేసే ఒక యజమానివంటిది. 'నీవు అలాచెయ్యాలి, ఇలాచెయ్యాలి' అని ఆజ్ఞాపిస్తుంది. ఒక అనుభూతి, స్వేచ్ఛ పొందే అవకాశం మీాకు ఉండదు. ఒక మనిషి విశ్వాసపాత్రుడుగా ఉండాలి. వినయవిధేయతలతో, అణిగిమణిగి ఉండాలి. చట్టాలకుబద్ధుడై ఉండాలి. ఆ చట్టాలు ఎలాంటివైనాసరే. చర్చి చక్కని సూక్తులు వల్లిస్తుంది. బిషప్ చట్టాలను వ్యతిరేకిస్తూ మాట్లాడ తాడు. ఇది సత్యమే. కాని ఈ పనులు వారు గత ఏభై ఏండ్లబట్టీ కొనసాగిస్తూనే వచ్చారు. అయినా ప్రయోజనం లేకపోయింది. విషయాలు రోజురోజుకూ పాడైపోతున్నాయి కాని బాగుపడడం లేదు."

అతని కంఠస్వరం మరింత హెచ్చింది. మళ్ళీ అతను అక్కడలేని మనుష్యు లెవర్నో ఉద్దేశించి చెపుతున్నట్లు చెప్ప సాగాడు.

"ఇక్కడ, జోహాన్నుబర్గులో ఉన్నవల్లా గనులు. ఆ గనులే ఇక్కడి సర్వస్వమూను. ఈ ఎత్తయిన మేడలు, బిల్డింగులు, భవంతులు, ఈ అద్భుతమైన నగర మందిరం, చక్కని ఇళ్ళతో శోభిల్లుతున్న ఈ అందమైన పార్కులూను; ఇవన్నీకూడా గనులనుంచి తీసిన బంగారంతో కట్టారు. ఈ అద్భుతమైన ఆస్పత్రి ఉన్నదే – ఇది యూరోపియనుల కోసం కట్టారు. భూమధ్యరేఖకు దక్షిణానవున్న ఆస్పత్రు లన్నిటిలోకీ పెద్ద ఆస్పత్రి ఇది. ఇదికూడా గనులనుంచి తీసిన బంగారంతో కట్టినదే."

అతని కంఠస్వరం మారింది. అదొక ఆబోతు రంకె లాగానో సింహగర్జన లాగానో వున్నది.

"మనకోసం కట్టిన ఆస్పత్రికి వెళ్ళి చూడండి." అన్నా డతను. "మన జనం వట్టి నేలమీదపడి పొర్లాడుతున్నారు. కాలు పెట్టడానికి సందులేకుండా మనిషి మీద మనిషి పడుకుని వున్నారు. కాని ఆ జనం వున్నారే – వాళ్ళే ఈ బంగారం పండించింది.

రోజుకు మూడు షిల్లింగులు కూలి తీసుకుని రెక్కలు పొయ్యేటట్లు గనులుత్రవ్వి బంగారం బయటికి తీసింది వాళ్ళే. మనజాతి వారైన వీరంతా ట్రాన్సుకీనుంచి, బసూటోలాండ్ నుంచి, బెఛూనాలాండ్ నుంచి, స్వాజీలాండ్ నుంచి, జూలూ లాండ్ నుంచి వచ్చారు. మన ఇన్‌డాట్ షేనీనుంచి కూడా

వచ్చారు. మనమంతా దొడ్లల్లో దోవల్లో నివశిస్తున్నాం. మనం మన భార్యలను బిడ్డలను కుటుంబాలను వదలివచ్చాం. కొత్తగా బంగారపుగని దొరికిందీఅంటే శ్రమ మనదే అయి నప్పటికీ మనకు ఎక్కువ డబ్బు ముట్టదు. తెల్లవాళ్ళకు మాత్రం వాటాలు పెరుగుతాయి. అధిక లాభాలు వస్తాయి. ఈ విషయాలు మీరు పత్రిక లన్నిట్లోనూ చదువుతూనే ఉంటారు. కొత్తగా బంగారం దొరికితే చాలు, వాళ్ళకు పిచ్చెక్కుతుంది. మన జనాన్ని ఇంకా ఎక్కువమందిని పట్టు కొస్తారు. మనం ఉండడానికి దొడ్లు, దోవలు అప్పచెప్పి మనచేత రాత్రింబవళ్ళు గనులు త్రవ్వించి చివరకు రోజు ఒక్కొంటికి మూడు షిల్లింగులు కూలిడబ్బులు మన చేతుల్లో పెడతారు. ఇలాంటప్పుడైనా మన శ్రమకు ఎక్కువ డబుబ ముట్టచెప్పే అవకాశ మున్నదని వాళ్ళు ఆలోచించరు. ఈ అవ కాశం తీసుకుని తాము ఇంకా ఒక పెద్దభవంతి కట్టవచ్చునని, ఇంకా ఒక పెద్దకారు కొనవచ్చునని మాత్రమే వారు ఆలో చిస్తారు. 'బంగారం కనుక్కోవడం ముఖ్యం. దక్షిణాఫ్రికా అంతటికీ బంగారపు గనులే ఆధారం. అవి లేకపోతే దక్షిణా ఫ్రికాయే లేదు' అంటారు వాళ్ళు."

అతను గర్జించాడు. అతని కంఠస్వరం ఇంకా గంభీ రంగా మారిపోయింది. అతను మాట్లాడుతోంటే ఉరుము ఉరుముతూ పోతున్నట్లుగా వున్నది.

"కాని దక్షిణాఫ్రికాను నిర్మించింది బంగారపు గను లతో కాదు, మన రెక్కలతో." అన్నాడతను. "మన రెక్కల కష్టంతో, మన చెమటతో, వంచిన నడుము ఎత్తకుండా

పనిచేసి మన శక్తంతా ధారపోసి దాన్ని నిర్మించాం. ఇక్కడున్న ప్రతి ఫ్యాక్టరీ, ప్రతి థియేటర్, ప్రతి అందమైన ఇల్లు, ఇవన్నీకూడా మన రెక్కల కష్టంతో కట్టాం. మరి ఈ విషయాలన్నీ మన ఊళ్ళోఉండే ఆ పెద్దకు, ఆ యజమానికి ఏం తెలుస్తాయి? కాని ఇక్కడ జోహానసుబర్గులో వాళ్ళకు తెలుసును."

అతను చెప్పడం ఆపి, మాట్లాడకుండా ఊరుకున్నాడు. వింటున్నవారుకూడా మౌనం వహించారు. ఎవరినైనా మాట్లాడకుండా చేసే మహాశక్తి ఏదో అతని కంఠస్వరంలో వున్నది. స్టీఫెన్‌కుమాలో మౌనంగా కూచుండి పోయాడు. ఇప్పుడతను చూస్తున్నది వెనుకటి తమ్ముణ్ణి కాదు, కొత్తతమ్ముణ్ణి. పూర్తిగా మారిపోయిన తమ్ముణ్ణి అతను చూస్తున్నాడు.

జాన్‌కుమాలో తన అన్నవంక చూచాడు.

"బిషప్ ఇది తప్పని చెపుతాడు." అన్నాడతను. "కాని అతను ఉండేది పెద్దభవంతిలో. అతనిక్రింద వుండే తెల్లవారైన మత గురువులంతా నీవు సంపాయించే దానికంటె నాలుగు, అయిదు, ఆరురెట్లు ఎక్కువ సంపాయిస్తారు అన్నయ్యా."

ఇలా అని అతను కూచున్నాడు. ఒక పెద్ద ఎర్రటి చేరుమాలుతీసి ముఖం తుడుచుకున్నాడు.

"ఇది నా స్వానుభవం. అంచాతనే నేను చర్చికి వెళ్ళడం మానేశాను." అన్నాడు.

"ఉత్తరం వ్రాయడంకూడా మానుకున్నది అందుకే అన్నమాట?"

"సరే, సరే. అదే కారణ మనుకుందాం."

"మరి ఆ విషయం - నీ భార్య ఈ స్త్రీ విషయం?"

"అవునవును, రెండూకూడా అందుకోసమే అనుకుం దాం. ఈ విషయాలన్నీ ఉత్తరాల్లో వివరించడం కష్టం. ఇక్కడ మా ఆచారాలన్నీ వేరు."

"ఇక్కడేమైనా ఆచారాలంటూ ఉన్నాయా?" అని అడిగాడు సిమాంగు.

జాన్‌కుమాలో అతనివంకచూచాడు. "ఇక్కడేదో కొత్త విషయం పెరిగి పెద్దదవుతోంది. అది అన్ని దేవాలయాలకంటె, అందరు ఖామందులకంటె బలవత్తరమైనది. ఏదో ఒకనాడు అది మీకు కంటపడక తప్పదు." అన్నాడు.

"మరి నీ భార్య? ఆవిడ నిన్ను ఎందుకు వదలిపెట్టి పోయింది?"

"సరే, సరే." అన్నాడు జాన్‌కుమాలో తన సహజమైన చిరునవ్వు ఒలకబోస్తూ. "నా అనుభవాలను అభిప్రాయాలను ఆవిడ అర్థంచేసుకోలేదు."

"అంటే నీ వనేది - ఆవిడ నీతి నియమాల యందు నమ్మకమున్న మనిషా?" అని సిమాంగు నిరుత్సాహంగా అడిగాడు.

జాన్ అతనివంక అనుమానాస్పదంగా చూచాడు. "నీతినియమాలు!" అన్నాడు. కాని తను అడిగింది అతనికి అర్థం కాలేదని సిమాంగు వెంటనే గ్రహించాడు.

"మళ్ళీ మనం జూలూ భాషలో మాట్లాడడం మంచి దనుకుంటాను." అన్నాడతను.

ఎద్దు మెడలాంటి అతని మెడమీద నరాలు క్రోధంతో ఉబ్బిపోయినాయి. ఆ మాటలు తనకు కోపం తెప్పించడానికే మాట్లాడినవని అతను గ్రహించాడు. కాని స్టీఫెన్ కుమాలో వెంటనే జోక్యం కలిగించుకున్నాడు:

"ఇదిగో, టీ వచ్చింది తమ్ముడూ. నీవు దయచూపుతున్నందుకు చాలా సంతోషం."

టీ తీసుకొచ్చిన స్త్రీని జాన్ పరిచయం చెయ్యలేదు. కాని ఆవిడ నమ్రతతో అందరికీ టీ అందించింది. ఆవిడ వెళ్ళిపోయిన తరువాత కుమాలో తన తమ్ముడితో ఇలాఅన్నాడు:

"నీవు చెప్పినవిషయాలన్నీ శ్రద్ధగావిన్నానుతమ్ముడూ. నీవు చెప్పిన విషయాలు చాలావరకు నాకు విచారం కలిగిస్తున్నాయి. [illegible] కొంత నీవుచెపుతున్న ధోరణినిబట్టి, కొంత వాటిల్లో చాలాభాగం నిజం ఉండడంవల్ల. సరే, ఇప్పుడు నిన్నొకవిషయం అడగాలనుకుంటున్నాను. కాని ముందొక విషయం చెపుతాను. మనచెల్లెలు గెర్ట్రూడ్ ఇక్కడ నాదగ్గరేఉంది. ఆవిడ మళ్ళీ నాతో ఇన్‌డాట్ షేనీకి వస్తోంది."

"మంచిది, మంచిది. అది మంచిపనికాదని నే నను. జోహానసుబర్గు ఒంటరిగా స్త్రీలు ఉండతగిన ప్రదేశం కాదు. నామటుకు నేను ఆవిడకు నచ్చచెప్పడానికి ఎంతో ప్రయత్నించాను. కాని ఆవిడ ఒప్పుకోలేదు. అంచాత మే మిరువురం మళ్ళీ కలుసుకోలేదు."

"సరే, ఇప్పు డడుగుతాను. నా కుమారు డెక్కడున్నాడు?"

జాన్ కళ్ళల్లో ఏదో అసౌఖ్యం లాంటిది అగుపించింది. అతను మళ్ళీ తన చేతిరుమాలు బయటికి తీశాడు.

"సరే అతను నా కొడుకుతో స్నేహంగా ఉంటున్నాడన్న విషయం నీవు వినేవుంటావు"

"అవును. ఆ విషయం విన్నాను."

"సరే, ఈ వ్యవహారమంతా ఎటువంటిదో నీకు తెలియందికాదు. అయినప్పటికీ నే నెప్పుడూ వాణ్ని నిందించను. నా కొడుక్కీ వాడి మారుతల్లికీ సరిపడలేదు. అందుకు కారణం ఏమిటో నా కెన్నడూ తెలీలేదు. ఏమైతేనేం వాడికి మారుతల్లితోను, ఆవిడ బిడ్డలతోను బొత్తిగా సరిపడలేదు. విషయాలు చక్కపరుద్దామని ఎన్నోతడవలు ప్రయత్నించాను. కాని ప్రయోజనం లేకపోయింది. అంచాత వాడు వెళ్ళిపోతానని చెప్పాడు. వాడికి చేతినిండా మంచిపని ఉండటంవల్ల నేను వాణ్ని ఆపలేదు. వాడితోపాటు నీ కొడుకు కూడా వెళ్ళాడు"

"ఎక్కడికి వెళ్ళారు తమ్ముడూ?"

"సరిగ్గా నాకు తెలీదు. కాని వాళ్ళిద్దరూ అలెగ్జాండ్రాలో ఒక గది తీసుకుని ఉంటున్నట్లు విన్నాను. సరే, ఒక్కనిమిషం ఆగు. వాళ్ళిద్దరూ ఒక ఫ్యాక్టరీలో పనిచేస్తున్నారు, నాకు జ్ఞాపకం ఉంది. ఉండు. టెలిఫోను బుక్కులో చూస్తాను అదెక్కడున్నదో."

అతను ఒక టేబిల్ మీద ఉన్న టెలిఫోన్ దగ్గరికి వెళ్ళాడు. క్రమంలో అది చూశాడు, తన తమ్ముడు అలాంటి

వస్తువులు వుంచుకోగల తాహతుగలవాడుగా కావడం చూచే సరికి అతను కాస్త గర్వంతో పొంగిపోయాడు.

"ఇదిగో డోరన్‌ఫాంటేన్ టెక్స్టయిల్స్ కంపెనీ, 14 క్రాసీస్ట్రీట్. ఇదీవాళ్ళ అడ్రెస్సు. నీకు వ్రాసిస్తా నుండు."

"మనం వాళ్ళకు టెలిఫోన్ చెయ్యకూడదూ?" అని అడిగాడు కుమాలో సందేహిస్తూ.

అది విని అతని తమ్ముడు నవ్వాడు. "దేనికి?" అన్నాడు. "అబ్‌సాలమ్ కుమాలో అక్కడ పనిచేస్తున్నాడా అని అడగడానికా? లేక అతన్ని టెలిఫోన్‌లో మాట్లాడమని చెప్పడానికా? లేక అతని అడ్రెస్సు ఏమిటని వాళ్ళను అడగ డానికా? నీ వెర్రిగాని నీగ్రోవాళ్ళకోసం వాళ్ళు ఇలాంటి పనులన్నీ చెయ్యరన్నయ్యా."

"మరేం ఫరవాలేదు" అన్నాడు సిమాంగు. "ఏం కావా లన్నా చేసిపెట్టడానికి నేనున్నాను నాయనా"

తరువాత వారు సెలవుపుచ్చుకుని అక్కడనుంచి వెళ్ళి పోయారు. వీధిలోకి వెళ్ళిన తరువాత సిమాంగు:

"ఓ! విన్నారా; అదీ విషయం" అన్నాడు.

"అవును. విన్నాను"

"ఇక్కడ మీ తమ్ముడు చాలా పెద్దవాడై పోయాడు. అతని షాపు ఎప్పుడూ జనంతో నిండి ఉంటుంది. ఇప్పుడు మీరు విన్నవిషయాలే మాట్లాడుకుంటూ ఉంటారు. కాని అసలు మీ తమ్ముణ్ణి చూడాలంటే మీటింగులోనే చూడా లని అంతా అంటారు. అతను, డుబులా, టామ్‌లిన్‌సన్ అనే మరో ఎర్రటివ్యక్తి, ఈ ముగ్గురూ జట్టు. మీ తమ్ముడు

మీటింగులో మాట్లాడుతుంటే ఆబోతు రంకె వేస్తున్నట్లు, సింహం గర్జిస్తున్నట్లు ఉంటుందని అంతా చెపుతారు, మాటలతో మనుష్యులకు పిచ్చి ఎక్కేట్లు చేయగలడట. కాని అంత దూరం వెళ్ళడానికి అతనికి సాహసం లేదంటారు. జైలులో పెడతారేమోనని భయం."

"కాని మీకొక్క విషయం చెపుతాను." అంటూ సిమాంగు మళ్ళీ చెప్పసాగాడు: "అతను చెప్పినవాటిల్లో చాలావిషయాలు సత్యాలు."

అతను వీధిలో నడుస్తున్నవాడల్లా ఆగి తన స్నేహితుడితో నెమ్మదిగాను, మనస్ఫూర్తిగాను చెప్పసాగాడు: "తెల్లవాడికి అధికారం ఉన్న కారణంచేత మనమూ అధికారం కావాలని కోరుతున్నాం." అన్నాడతను. "కాని నల్లవాడికే కనుక అధికారం, ధనం అబ్బి ఏవిధంగానూ భ్రష్టుడు కాకుండా ఉంటే అతను గొప్పవ్యక్తి అయితీరుతాడు, సందేహంలేదు. ఈ విషయం నేను తరుచు చూస్తున్నాను. అతను తప్పును సరిదిద్దడానికని అధికారంకోసం ధనంకోసం దేవులాడతాడు. కాని అవి రెండూ లభించగానే వాటిని అనుభవించి ఆనందిస్తాడు. ఇప్పుడతను తన వాంఛలు తీర్చుకుని సంతుష్టిపడగలడు. తెల్లవాడు తయారుచేసిన బ్రాందీ సంపాదించే మార్గాలు కనుక్కోగలడు. వేలమందితో మాట్లాడగలడు, వారిమాటలు వినగలడు. వారిచేత చప్పట్లు కొట్టించుకోగలడు, తాను వారికి చప్పట్లు కొట్టగలడు. మనలో కొందరు మనకు అధికారంవస్తే అధికారం ఉన్న తెల్లవాడిపై పగతీర్చుకోవచ్చునని అనుకుంటారు. అందుకు కారణం మన కోరికలు చెడ్డవికావడమే.

మన బుద్ధులు చెడిపోయినాయి ఇక అధికారమంటారా? అధికారానికి అంతరాత్మ లేదు. కాని చాలామంది తెల్లవాళ్ళు కూడా ఈ సత్యాన్ని తెలుసుకోక అధికారంకోసం పడిచస్తారు. ఆ అధికారం మనచేతుల్లోకివస్తుం దేమో అని భయపడతారు."

తన వివరణ సరిగ్గా ఉన్నదో లేదో అని పరీక్షించుకుంటున్నట్లుగా అతను నిలుచుండిపోయాడు. "అవును. అధికారాన్ని గురించి నే చెప్పిందివాస్తవం" అన్నాడతను మళ్ళీ. "కాని పూర్తి అధికారం కలది ఒక్కటిమాత్రమే ఉన్నది. అది ప్రేమ. కారణం మనిషి ఎప్పుడైతే ప్రేమిస్తాడో అప్పుడతను అధికారంకోసం దేవులాడడు. కనుక అన్ని అధికారాలు అతనికీ ఉంటాయి. మన దేశాన్ని గురించి నాకు ఒక్కటే ఒక్క ఆశఉన్నది. తెల్లవాళ్ళు నల్లవాళ్ళుకూడా అధికారం కాని ధనం కాని వాంఛించకుండా, భేదాలన్నీ విస్మరించి అందరూ ఐకమత్యంతో దేశ సౌభాగ్యంకోసం పాటుపడిననాడు మన దేశం బాగుపడుతుంది."

అతను గంభీరంగాను, మౌనంగాను వున్నాడు. విచారంగా మళ్ళీ ఇలా అన్నాడు:

"నా హృదయంలో ఒకే ఒక భయం పీడిస్తున్నది. వాళ్ళు ప్రేమించడం మొదలు పెట్టిననాడు మనం ద్వేషించడం మొదలు పెడతామేమోనని నా భయం."

"సరే. ఇలా కుంటినడక నడిస్తే మనం డోర్ ఫౌన్‌టేన్ చేరం. రండి, త్వరగా వెడదాం." అన్నాడు.

కుమూలో మాట్లాడకుండా అతన్ని అనుసరించాడు. గంభీరంగాను, విచారంగాను అతను చెప్పిన మాటలకు కుమూలో హృదయం బాధపడింది.

కాని డోర్ఫాన్‌టీన్‌లో వారు వెళ్ళినపని కాలేదు. అక్కడ తెల్లవాళ్ళు వారిని తగు మర్యాదగానే చూచారు. తెల్లవాళ్ళతో ఎలా నడుచుకోవాలో, విషయాలెలా పరిష్కరించుకోవాలో సిమూంగుకు తెలుసును. కాని వారు శ్రమ పడక తప్పలేదు. అబ్‌సాలమ్ కుమూలో అక్కడనుంచి పన్నెండు మాసాల క్రితమే వెళ్ళిపోయినట్లు వారికి తెలిసింది. అబ్‌సాలమ్ తనతోటి పనివాళ్ళల్లో ఒకడైన ఢ్యామినీ అనే అతనితో స్నేహంగా ఉండేవాడనీ, ఇతన్నేమో పనిలోనుంచి తీసివేశారనీ అక్కడో కాయన వారితో చెప్పాడు. తరువాత అతను మిసెస్ ఇంగ్లెలాతో కలిసి సోఫియాటౌన్ చివరవీధిలో ఉంటున్నట్లు తను విన్నాననీ, తరువాత అతని సంగతి తెలియరాలేదనీ చెప్పాడు. ఆ వీధి వెస్ట్‌డేనుకు చెందిన యూరోపియన్ పరిసరాలనుంచి సోఫియాటౌన్‌ను వేరు చేస్తున్నది. ఏమైనా ఆయన నీ విషయాలన్నీ కచ్చితంగా చెప్పలేదు. ఏదో తను విన్నవీ, జ్ఞాపకమున్నవీ చెప్పాడు. ఆ ఇంటి నెంబరు 105 అని జ్ఞాపకమన్నాడు.

అంచాత వారిద్దరూ మళ్ళీ వెనక్కి తిరిగి సోఫియాటౌనుకు వచ్చారు. అక్కడ చివరవీధిలో 105 నెంబరు ఇంట్లో వున్న మిసెస్, ఇంగ్లెలాను కలుసుకుని మాట్లాడారు. ఆవిడ ప్రేమతో వారిని ఆహ్వానించింది. ఆవిడకు పిల్లలున్నారు. ఆ పసిపిల్లలు తల్లిచాటున దాక్కొని, వచ్చిన ఆ కొత్తవారి

వంక తొంగి తొంగి చూడసాగారు. కాని అబసాలమ్ అక్కడ లేడని ఆవిడ చెప్పింది.

"ఒక్కక్షణం వుండండి. అతనిక్కడ వదిలివెళ్ళిన సామాను గురించి మాకో ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం ఎక్కడున్నదో వెదుకుతాను" అన్నదావిడ.

ఆవిడ ఉత్తరం వెదికేలోగా కుమాలో ఆ చంటిపిల్లతో ఆడుకుంటూ కూచున్నాడు. సిమాంగు ఏమో ఆవిడ భర్తతో మాట్లాడుకుంటూ కూచున్నాడు. ఆవిడ ఒకపెద్ద పెట్టె బయటికి తెచ్చింది. దాన్నిండా కాగితాలు, ఇంకా ఇతరవస్తువులు ఉన్నాయి. ఆవిడ ఉత్తరంకోసం వెదకింది. ఆవిడ అలా వెదుకుతూ ఉంటే సిమాంగు ఆవిడ ముఖంలోని ఆర్ద్రితను, అలుపును పరిశీలించాడు. వెదికేదల్లా ఆవిడ ఒక్కక్షణంపాటు ఆగి కుమాలో వంక చూచింది. ఆవిడ చూపుల్లో ఏదో తెలుసుకోవాలనే కుతూహలం ఒకవైపున, జాలి ఒకవైపున కనిపించాయి. చివరకెలాగైతేనేం ఆవిడకా ఉత్తరం అగుపించింది. దానిలో ఉన్న అతని అడ్రెస్సు వారికి చూపించింది.

అబ్సాలమ్ కుమాలో - కేరాఫ్ మిసెస్ కీజ్, 79, ఇరవైమూడవ అవెన్యూ, అలెగ్జాండ్రా.

తరువాత వారు టీ త్రాగారు. వారు లేచి వెళ్ళబోయేటప్పటికే చీకటిపడింది. ఆవిడ భర్త కుమాలోను సాగనంపడానికి అతనివెంట వీధిలోకి వచ్చాడు.

సిమాంగు ఆ ఇల్లాలిని "నా స్నేహితుడివంక మీరెందుకంత జాలిగా చూచారు?" అని అడిగాడు.

ఆవిడ ఒకమాటు కళ్ళుదించుకుంది. మళ్ళీ కళ్ళెత్తి "ఆయన ఒక మతగురువు" అన్నది.

"అవును"

"ఆయన కొడుకుచేసే సావాసాలు నాకు నచ్చవు. నాభర్తకు కూడా అవి గిట్టవు. అంచాతినే ఆ అబ్బాయి మా యింట్లోనుంచి వెళ్ళిపోయాడు"

"అవును. నా కర్థమైంది. అంతకన్నా చెడువిషయా లింకా ఏమైనా ఉన్నాయా ?"

"లేదు. నా కంటపడలేదు. కాని అతని స్నేహితులంటే నాకు గిట్టదు"

ఆవిడ ముఖంలో నిజాయితీ, నిష్కాపట్యం అగుపించాయి. ఇప్పుడావిడ మళ్ళీ కళ్ళు దించుకోలేదు.

"నమస్కారం, వెళ్ళివస్తానమ్మా"

"మంచిది. నమస్కారం ఉమ్ఫునేడీన్"

వీధిలోకి వచ్చిన తరువాత వారిద్దరూ ఆవిడ భర్త దగ్గర సెలవు తీసుకున్నారు. అక్కడనుంచి బయలుదేరి మళ్ళీ మిషన్‌హౌస్‌కు వచ్చారు.

"రేపు మనం అలెగ్జాండ్రాకు వెడదాం" అన్నాడు సిమాంగు.

కుమాలో తన స్నేహితుడిచెయ్యి పట్టుకున్నాడు. "అనేక కష్టాలు మూటకట్టుకుని జోహానసుబర్గు వచ్చాను. కాని మీ స్నేహం లభించడంవల్ల నా కెంతో హాయిగా, ఆనందంగా ఉన్నది." అన్నాడు.

"ఓ! మనం త్వరత్వరగా వెళ్ళాలి.లేకపోతే భోజనానికి ఆలస్యమవుతుంది." అన్నాడు సిమాంగు.

౮

ఆ మరుసటిరోజు మిషన్‌హౌస్‌లో భోజనంచేసిన తరువాత సిమాంగు, కుమాలో అలెగ్జాండ్రాకు బయలు దేరారు. వెడల్పుగా ఉన్న పెద్దరోడ్డు అది. ఆ రోడ్డున బస్సులు నడుస్తాయి.

"ఇక్కడ మీరు ఏబస్సుఎక్కినా ఫరవాలేదు, మిమ్మల్ని తీసుకెడుతుంది." అన్నాడు సిమాంగు.

అదివిని కుమాలో చిరునవ్వు నవ్వాడు - ఒక బస్సు ఎక్కబోయి మరో బస్సు ఎక్కుతానని తనకుగల భయాన్ని గురించి చమత్కారంగా ఆ మాట అన్నాడు సిమాంగు.

"ఈ బస్సులన్నీ జోహానసుబర్గుకు వెడతాయి. పొర పాటున మరోబస్సు ఎక్కుతానని భయపడవలసిన పనిలేదు మీరు.

అలాగేవారు మొదట వచ్చిన బస్సులోనే ఎక్కారు. అది వారిని కుమాలో ప్రాను నాణెం పోగొట్టుకున్న చోటికి తీసుకొచ్చి దింపింది. అక్కడనుంచి వారు మళ్ళీ కాలినడక సాగించారు. కార్లు, బస్సులు, జనం, వీటితో క్రిక్కిరిసివున్న అనేకవీధుల్లోగుండా నడిచివెళ్ళారు. అలెగ్జాండ్రాకు వెళ్ళే బస్సులు ఆగేచోటికి చేరుకున్నారు. కాని ఇక్కడికి రాగానే వారికి తలవని తలంపుగా ఒక ఆటకం ఎదురైంది. ఒకతను

సరాసరి వారిదగ్గరి కొచ్చాడు. సిమూంగుతో "మీరు అలె గ్జాండ్రాకు వెడుతున్నారా ఉమ్‌ఫున్‌డీన్?" అని అడిగాడు.

"అవును నాయనా."

"మిమ్మల్ని వెళ్ళకుండా ఆపడంకోసమే మేం ఇక్కడున్నాం ఉమ్‌ఫున్‌డీన్. అంటే బలాత్కారంగా కాదు చూడండి" అంటూ అతను అవతల ఉన్న పోలీసువంక చూపించాడు. "మిమ్మల్ని బలవంతంగా మే మేమైనా చేసినట్లయితే చర్య తీసుకోవడానికి ఇక్కడే పోలీసు ఉన్నాడు, కాని మీకు చెప్పి ఒప్పించాలనే మా ప్రయత్నం. మీరు యీబస్సులో ప్రయాణంచేసినట్లయితే, ఏ కారణం కోసం నల్లజాతివారు పోరాడుతున్నారో ఆ కారణాన్ని మీరు బలహీన పరచిన వారవుతారు. బస్సుచార్జీ మళ్ళీ వెనుకటిలాగా నాలుగు పెన్నీలు చేసేవరకూ ఈ బస్సుల్లో ఎక్కకూడదని మేము నిశ్చయించుకున్నాం."

"అవును. ఆ విషయం నేనూ విన్నాను."

ఇలాఅని సిమూంగు కుమాలో వైపు తిరిగాడు. "స్నేహితుడా! నేను చాలా అవివేకంలో పడ్డాను. బస్సులు లేవన్న విషయం మరిచేపోయాను. కనీసం బస్సులను బాయ్‌కాట్ చేశారన్న విషయమైనా నాకు జ్ఞాపకం రాలేదు" అన్నాడు.

అప్పుడు కుమాలో "మేం చాలా అత్యవసరమైన పని మీద వెడుతున్నాం" అన్నాడు ఆ మనిషితో నమ్రతగా.

"ఈ బాయ్‌కాట్ కూడా చాలా అత్యవసరమైనదే" అన్నాడా మనిషి మర్యాదగా. "మనుష్యులను ఆరుపెన్నీలు

చెల్లించవలసిందని కోరుతున్నారు వాళ్ళు; అంటే రానూ పోనూ రోజు ఒక్కొంటికి మాకు బస్సుచార్జీ క్రింద పిల్లింగు ఖర్చవుతుందన్నమాట. వారానికి ఆరుపిల్లింగులు. మాలో కొందరి సంపాదన అయితే కేవలం ముప్ఫయిఅయిదు లేక నలభై పిల్లింగులు మాత్రమే."

"నడవాలంటే చాలాదూరమా?" అని అడిగాడు కుమాలో.

"చాలాదూరం ఉమ్‌ఫున్‌డీన్ – పదకొండుమైళ్ళు."

"నా లాంటి వృద్ధుడికి అంతదూరం నడపటం కష్టమే నాయనా."

"మీలాంటి వృద్ధులు అనేకమంది ప్రతిరోజూ ఇలాగే బాధపడుతున్నారు ఉమ్‌ఫున్‌డీన్. స్త్రీలు, రోగంతో ఉన్న వాళ్ళు, కళ్ళు, కాళ్ళు సరిగ్గా లేనివాళ్ళు, పసిపిల్లలు, అందరూ ఈ బాధ పడుతూనేఉన్నారు. వీరంతా ఇళ్ళదగ్గర ఉదయం నాలుగుగంటలకు కాలినడకన బయలుదేరతారు. మళ్ళీ రాత్రి ఎనిమిదిగంటలకు కూడా ఇళ్ళకు చేరుకోరు. ఏదో ఇంత మునిపళ్ళమీద కొరుకుతారు. అదే వారితిండి. వారి కళ్ళు బెత్తెడు లోతున గుంజుకుపోయి ఉంటాయి. రాత్రి కన్ను మూయడం కనాకష్టం. మళ్ళీ అంతలోనే తెల్లవారవస్తుంది. చటుక్కున లేస్తారు. ఒకొక్కతడవ వట్టి వేడినీళ్ళతో కడుపు నింపుకుని పనికి బయలుదేరుతారు. మిమ్మల్ని బస్సు ఎక్క వద్దని నేను బలవంతం చెయ్యడంలేదు ఉమ్‌ఫున్‌డీన్. ఈ పోరాటానికి మూలకారణం ఇదని చెపుతున్నాను. దీన్ని జారవిడుచుకున్నామూ అంటే, అప్పుడు మేము సోఫియాటౌన్‌లో, క్లేర్

మాంట్‌లో, క్లిప్‌టౌన్‌లో, ప్లిమ్‌విలీలో ఎక్కువ చార్జీలు చెల్లించుకోవలసి వస్తుంది."

"అంతా అర్థమైంది నాయనా. మేం బస్సు ఎక్కం."

అతను వారికి కృతజ్ఞతాభివందనా లర్పించాడు. వారి దగ్గర సెలవుతీసుకుని మరో ప్రయాణీకుడి దగ్గరికి వెళ్ళాడు.

"అతని మాటలు ఎంతో మధురంగా ఉన్నాయి." అన్నాడు కుమాలో.

"అతనే దుబులా. ప్రసిద్ధికెక్కిన వ్యక్తి." అన్నాడు సిమూంగు మెల్లగా. "మీ తమ్ముడు జాన్‌కు స్నేహితుడు కూడా. కాని వాళ్ళు అంటూవుంటారు; నా స్నేహితుడు టామ్‌లిన్‌సన్‌కు బుద్ధిఉన్నది. మీ తమ్ముడికి నోరు ఉన్నది కాని ఈ మనిషికి హృదయమున్నది. ఇతనంటే ప్రభుత్వం గజగజ వణికిపోతుంది. కారణం ఇతనికి భయమున్నమాటలేదు. స్వలాభంకోసం ఏపనీ చేయడు. స్వంతపనికూడా మానుకుని ఇలా బస్సులదగ్గర పికెటింగ్ చేస్తుంటాడు. ఇతని భార్యకూడా అలెగ్జాండ్రాలోని మరో బస్సుస్టాండ్ దగ్గర ఇలాగే పికెటింగ్ చేస్తూ ఉంటుంది."

"నిజంగా ఇవి గర్వపడవలసిన విషయాలు. జోహాన్సుబర్గులో ఎన్నెన్ని అద్భుతాలు జరుగుతాయి !"

"వీరంతా ఇంతకు మునుపు మన చర్చికి చెందినవారే." అన్నాడు సిమూంగు విచారకరంగా. "కాని ఇప్పుడు మత విషయాలన్నీ మానుకున్నారు. మీ తమ్ముడులాగానే వీరు కూడా 'చర్చి మాటలు చెపుతుంది కాని పనులుచేయదు' అని అంటారు. సరే, స్నేహితుడా, మనమిప్పుడేం చేద్దాం?"

"నడిచి వెళ్ళడం నాకిష్టమే" అన్నాడు సుమూలో.

"పదకొండు మైళ్ళు పోను, పదకొండు మైళ్ళు రాను. చాలా దూరపు ప్రయాణం"

"అయినా నా కిష్టమే. నేనెంత ఆతృతతో వున్నానో మీకు తెలియంది కాదు నాయనా. ఈ జోహాన్సుబర్గ్ మహా నగరంలో — కుర్రవాడు ఒంటిగా ఉండదగిన చోటు కా దిది."

"మంచిది. అయితే ఇహ మనం నడకసాగిద్దాం."

అలా వారిరువురు ఆ యూరోపియన్ నగరంలోనుంచి అనేక మైళ్ళు నడచివెళ్ళారు. ఎగువనఉన్న ట్విస్ట్‌స్ట్రీట్‌నుంచి క్లేరెన్‌డన్ సర్కిల్, దిగువనవున్న టాయిన్ బోతానుంచి ఆరెంజి గ్రోవ్ వరకూ నడిచివెళ్ళారు. అన్నివైపులనుంచీ కార్లు, లారీలు, సందులేకుండా వస్తున్నాయి; పోతున్నాయి. ఏదీకూడా ఎక్కడా ఆగడమంటూ లేదు. ఇలా చాలాసేపు గడిచిన తరువాత ఒక కారు ఆగింది. అందులోనుంచి ఒక తెల్లవాడు వారితో మాట్లాడాడు.

"మీరిరువురూ ఎక్కడికి వెడుతున్నారు?" అని అడిగాడతను.

"అలెగ్జాండ్రాకు వెడుతున్నాం బాబూ." అని చెప్పాడు సిమాంగు, తలమీది హేటు తీసి.

"మీరక్కడికే వెడుతున్నారని అనుకున్నాను. సరే. కారులో ఎక్కండి."

నిజంగా అతనుచేసిన సహాయం ఇంతా అంతా కాదు. అలెగ్జాండ్రాకు వెళ్ళేరోడ్డు మూలతిరుగుళ్ళో వారు కారు

దిగారు. ఆ తెల్లమనిషికి తమ కృతజ్ఞతాభివందనా లర్పించారు.

"ఇది చాలా దూరపు ప్రయాణం. మీకు బస్సులు లేవన్న విషయం నాకు తెలుసును." అన్నాడా తెల్లమనిషి.

అతను వెళ్ళిపోతాడేమో చూద్దామని వారు అక్కడే నిలుచున్నారు. కాని అతను సరాసరి వెళ్ళిపోకుండా కారును చుట్టూతిప్పి వెనక్కు మళ్ళాడు. తిరిగీ జోహానసుబర్గుకు వెళ్ళే మార్గాన వెళ్ళిపోయాడు.

"ఓ! నిజంగా ఇది అత్యాశ్చర్యకరమైన విషయం." అన్నాడు సిమాంగు.

ఇరవై మూడవ అవెన్యూ చేరడానికి ఇంకా చాలా దూరం నడిచివెళ్ళాలి. రోడ్డు కిరువైపులా చెట్లవరుసలతో వున్న అవెన్యూలు ఒకదాని తరువాత ఒకటి దాటుతూ వారు నడక సాగిస్తున్నారు. సిమాంగు అనేక విషయాలు వివరించి చెప్పడం మొదలు పెట్టాడు: జోహానసుబర్గు నగర సరిహద్దులకు వెలుపల అలెగ్జాండ్రా వున్నది. ఆ ప్రాంతంలో నల్లజాతి వాళ్ళు భూమి కొనుక్కోవచ్చును. ఇల్లు కట్టుకోవచ్చును. కాని వీధులు మాత్రం దిక్కూ దివాణం లేకుండా పడి వున్నాయి. వీధుల్లో దీపాలు లేవు. స్థలాలకు చాలా గిరాకీగా వున్నది. ఎక్కడా జాగాలు దొరకడం లేదు. వీలైనంత వరకు ప్రతివాడూ స్థలాలు కొన్నాడు. ఇళ్ళు కట్టుకున్నాడు. దొడ్లలోకూడా గదులుకట్టి ఇతరులకు అద్దెకిస్తున్నారు. యీ గదుల్లో చాలాభాగం దొంగలకు, దోపిడీ గాండ్రకు నిలయమైపోయింది. వాళ్ళ రహస్య వ్యాపారాలన్నీ దాసాగనికి

ఇక్కడ చక్కని పేలున్నది. వ్యభిచారం, దొంగతనంగా సారాయి తయారుచేయడం ఈ ప్రాంతంలో పరిపాటి అయి పోయింది.

"ఈ విషయాలన్నీ చాలా చెడుగా పరిణమించాయి" అంటూ చెప్పసాగాడు సిమాంగు. "ఆరెంజ్‌గ్రోవ్‌లో, నార్‌వుడ్‌లో, నార్తు హైలాండ్సులో ఉండే తెల్లవారంతా ఈ ప్రదేశాన్ని ఇక్కడనుంచి పూర్తిగా ఎత్తివేయవలసిం దని ఒక పెద్దమహాజరు పెట్టారు. మన కుర్రవాళ్ళల్లో ఒక కుర్ర వాడు అక్కడఉండే వృద్ధురాలయిన ఒక తెల్లజాతి స్త్రీ దగ్గర నుంచి ఒక సంచీ ఊడలాక్కున్నాడు. వెంటనే ఆ వృద్ధురాలు గాబరాపడి నేలమీద కూలిపోయి ఉన్నచోటనే ఊపిరి విడిచింది. తరువాత మరో భయంకరమైన సంఘటన చెపుతాను. ఇక్కడికి దాపులోనే ఒక ఇంట్లో ఒక తెల్లజాతిస్త్రీ ఉంటోంది. మన యువకులు కొందరు వెళ్ళి ఆవిడ ఇంట్లో చొరబడ్డారు. ఆవిడ వాళ్ళను ఎదిరించింది. దాంతో వాళ్ళు ఆమెను అక్కడే చంపేశారు. ఒక్కొక్కప్పుడు చాలామంది తెల్లజాతి స్త్రీలు, పురుషులుకూడా ప్రెటోరియారోడ్డుమీద చెట్లకింద తమకార్లు ఆపుకుని ఆ చీకట్లో కూచుంటారు. మన కుర్రకారు వాళ్ళల్లో కొందరువెళ్ళి అప్పుడప్పుడు వాళ్ళపైనబడి దోచుకుంటారు. దౌర్జన్యాలు చేస్తారు. ఒక్కొక్కప్పుడు స్త్రీలుకూడా వెళ్ళి ఆ పనులు చేస్తుంటారు. అయితే నిజానికి సాధారణంగా చెడి పోయిన స్త్రీలే ఇలాంటి పనులు చేసేది. కాని నోట ఉచ్చ రించరాని నేరాలివి.

"నాకు జ్ఞాపకమున్న మరోరకమైన సంఘటన చెప్తాను వినండి. జోహానసుబర్గునగరం అవతలప్రక్కనజరిగిన సంఘటన అది. అక్కడ పోచెఫ్‌స్ట్రూమ్ రోడ్డుమీద విడిగా ఒక ఇంట్లో నా స్నేహితుడొకాయన కాపురం ఉంటున్నాడు. అది శీతాకాలంలో ఒకనాటిరాత్రి. ఎముకలు కొరికే చలి. తెల్లవారడానికింకా ఎంతో వ్యవధిఉంది. ఆవేళటప్పుడు అతని ఇంటితలుపు ఎవరో తట్టారు. తలుపు తెరిచిచూచేసరికి ఒక తెల్లజాతి స్త్రీ వాకిట్లో నిలవబడిఉంది. ఆవిడకు వంటిమీద గుడ్డలేదు - బదాబదలయిపోయిన ఒక పేలికమాత్రం ఉన్నది. ఆవిడ తన మానాన్ని కాపాడుకోవడానికి నానాబాధ పడుతోంది. ఆ కాస్త గుడ్డపేలికను వంటికి కప్పుకోవడానికి ప్రయత్నిస్తూ రెండుచేతులూ అడ్డంపెట్టుకుంది. పాపం ఆ చలిలో గడగడవణికిపోతున్నది. శరీరం కొయ్యబారిపోయి నలుపువర్ణానికి తిరిగింది. ఆవిడను ఇంతపనిచేసిన పుణ్యాత్ముడు ఒక తెల్లవాడు. ఆవిడను తన కార్లోఎక్కించుకుని తీసుకపోయాడు. ఆవిడతో తృప్తిపడ్డాడో లేదో —— ఆ పాపపుణ్యాలు ఆ భగవంతుడికే తెలియాలి. నా కళ్ళతో చూడలేదు - నే నక్కడ లేను. అత నావిడను ఈ స్థితికి తెచ్చి - ఈ కాస్త గుడ్డపీలికను మాత్రం వంటిమీద మిగిల్చి వీథిలోకి గెంటేశాడు. తన త్రోవన తాను మళ్ళీ జోహానసుబర్గుకు వెళ్ళిపోయాడు. సరే. ఆ తరువాత నాస్నేహితుడు, అతనిభార్య కొన్ని పాతదుస్తులు తీసి ఆవిడకు కట్టుకోవడానికి ఇచ్చారు. చలివేయకుండా కఆ పాతకోటుకూడా చూచి ఇచ్చారు. వేడి వేడి టీ కొంచెం త్రాగించి వంటినిండా దుప్పట్లుకప్పి పడుకోబెట్టారు. ఈ సందడికి

పిల్లలు నిద్రలేచారు. ఇదంతా ఏమిటో చెప్పమని గుచ్చిగుచ్చి అడిగారు. కాని తల్లిదండ్రులు వాళ్ళను ఇదంతా చూడనీయకుండా పడుకోబెట్టి నిద్రపుచ్చారు. తరువాత నా స్నేహితుడు ఆ కటికి చీకట్లో ఇల్లువిడిచి అక్కడికి దాపులోనే ఉన్న తెల్ల జాతివాడైన ఒక రైతు ఇంటికి వెళ్ళాడు. చీకట్లో కుక్కలు అరుస్తున్నాయి. అతనికి భయంవేసింది. అయినా మొండికేసి వెళ్ళాడు. తెల్లవాడితో ఈ విషయమంతా విపులంగా చెప్పాడు. ఈ వ్యవహారాన్ని ఏ గొడవాలేకుండా, ప్రశాంతంగా పరిష్కరించవలసి ఉంటుందని కోరాడు. ఆ తెల్లవాడు తాను వస్తానని చెప్పాడు. తన కారుతీసి బయటపెట్టాడు. తరువాత ఇద్దరూ కార్లో ఎక్కి నా స్నేహితుడి ఇంటికి వచ్చారు. ఆ తెల్లజాతి స్త్రీ వారికి కొంత డబ్బుఅయినా ఇచ్చి వారుచేసిన ఉపకారానికి కృతజ్ఞత తెలుపుకుని ఉండేది. కాని ఆవిడదగ్గర డబ్బులేదు. ఆ విషయం విని నా స్నేహితుడు, అతని భార్యకూడా డబ్బుతో పనిలేదని చెప్పారు. ఆ తెల్లవాడు నా స్నేహితుడితో రెండుసార్లు ఇలా అన్నాడు :

"నీవు మంచి కాఫిర్‌వి, నీవు మంచి కాఫిర్‌వి."

ఎంచేతనో అతని హృదయం ద్రవించింది. తనకు వచ్చిన మాటల్లో ఆ విధంగా కృతజ్ఞతలు తెలిపాడు."

"ఇది వింటోంటే నా హృదయం కూడా కరిగిపోతోంది" అన్నాడు కుమార్.

"సరే. ఇంతకూ మీకు ఆ అర్జీని గురించి చెపుతున్నాను. మనకు స్నేహితులైన తెల్లవాళ్ళంతా ఆ అర్జీని త్రోసివేయవలసిందని గట్టిగా పోరాడారు. అలెగ్జాండ్రా వలన

కీడుకంటే మేలే ఎక్కువ ఉన్నదనీ, చెడువిషయాలకంటె మంచి విషయాలే ఎక్కువ ఉన్నాయనీ అన్నారు. ఈ గడ్డమీద పుట్టినవాడు ఆ ప్రాంతంలో ఒక స్థలం కొనుక్కోవడానికీ, ఒక ఇల్లు కట్టుకొని భార్యాబిడ్డలను పోషించుకోవడానికీ, తన దని చెప్పుకునే ఒక హక్కు, అవకాశం కలిగి ఉండడానికీ వీలు న్నదని వారంతా ఆందోళన చేశారు. ప్రొఫెసర్ పోర్లీ— పాపం చచ్చి ఏలోకాన ఉన్నాడో - మనకోసం తీవ్రంగా పోరాడిన మహావ్యక్తి. ఓ! మీరా రాయన్నుగురించి వినక పోవడం విచారకరమైన విషయం. టామ్లిన్‌సన్ తెలివి, మీ తమ్ముడి వాగ్ధాటి, దుబులాకు గల కరుణహృదయం, ఈ మూడూ ఆయనలో మూర్తీభవించి ఉన్నాయి. ఆయన మాట్లాడుతుంటే ఏ తెల్లవాడూ ఎదురు చెప్పలేడు. ఓ! ఇప్పటికీ నా కా విషయాలు మనస్సులో మెదులుతున్నాయి. 'ఇక్కడిది ఉన్నది. అక్కడది ఉన్నది. అదిగో, ఆ కనిపించే— దూరంగా, దూర దూరంగా ఉన్న విషయం అక్కడే దూరంగా ఉన్నది. నేను నెలకొల్పిన ఈ విషయాలను అవి ఉన్న చోటునుంచి ఏ మనిషి అయినాసరే ఒక్క అంగుళం కూడా కదపలేడు. నేను ఏ ఏ స్థానాల్లో వీటిని ఉంచానో వాటిని ఆ యా స్థానాల్లో నుంచి కదిలించడం ఏ ఇంగ్లీషువాడికి కాని ఆఫ్రికావాడికి కాని సాధ్యంకాదు' అనేవా డాయన."

ఇలా చెప్పి సిమాంగు తన చేరుమాలుతో ముఖం తుడుచుకున్నాడు; "నేను చాలా చాలా మాట్లాడాను. సరే ఇదే మనకు కావలసిన ఇంటిదగ్గరికి వచ్చాంలెండి."

ఒక స్త్రీ వచ్చి తలుపు తెరిచింది. ఆవిడ వారికి ఎలాటి స్వాగతమూ ఇవ్వలేదు. ఏ విధంగా అభివందనాలు తెల్పనూ లేదు. వారు తాము వచ్చిన పనిని గురించి చెప్పిన తరువాత వారిని అయిష్టంగానే ఇంట్లోకి రానిచ్చింది.

"మిసెస్ కీజ్! అయితే ఆ అబ్బాయి వెళ్ళిపోయాడంటావా?"

"అవును. అతనెక్కడికి వెళ్ళాడో నాకు తెలీదు"

"ఎప్పుడు వెళ్ళాడు?"

"ఎన్నో మాసాలయింది. ఒక ఏడాది అయివుంటుంది."

"అతని కెవరైనా ఒక స్నేహితుడున్నాడా?"

"అవును, వున్నాడు. అతనూ కుమాలోయే. అతని పెత్తండ్రి కొడుకట. కాని వారిరువురూ కలిసే వెళ్ళిపోయారు."

"అయితే వాళ్ళెక్కడికి వెళ్ళారో నీకు తెలీదూ?"

"చాలా ఊళ్ళను గురించి మాట్లాడుకున్నారు. ఈ వయస్సులోవున్న కుర్రవాళ్ళంతా ఎంత ఇదిగా మాట్లాడుకుంటారో మీకు తెలియంది కాదు."

"అయితే ఈ కుర్రవాడున్నాడే - అబ్సాలమ్? ఇతను ఎలా ప్రవర్తించేవాడు?" అని ఆవిడను అడిగాడు కుమాలో.

ఆవిడ కళ్ళల్లో భయం తొణికిస లాడింది. ఇహా ఇప్పుడతని కళ్ళల్లోకూడా భయం కదుల్లాడింది. ఆ ఇల్లంతా భయం పారాడింది.

"చెడు గేమీ నాకు కనిపించలేదు." అన్నదావిడ.

"కాని ఏదో చెడుగున్నట్లు నీవు ఊహించుకున్నావు."

"చెడు గేమీ లేదు." అన్నదావిడ మళ్ళీ.

"అయితే నీవెందుకు భయపడుతున్నావు?"

"నేనేం భయపడడంలేదు." అన్న దావిడ.

"మరి అలా వణికిపోతున్నా వెందుకు?" అని అడిగాడు సిమాంగు.

"నాకు శీతలంగా ఉంది." అన్నదావిడ.

ఆవిడ చిరచిరలాడుతూను, జాగరూకతతోను వారి వంక చూచింది.

"శ్రమ ఇచ్చినందుకు క్షమించమ్మా. వెళ్ళొస్తాం." అన్నాడు సిమాంగు.

"మంచిది, వెళ్ళిరండి" అన్న దావిడ.

వీధిలోకి వచ్చినతరువాత కుమాలో ఇలాఅన్నాడు:

"ఏదో జరగకూడనిది జరిగింది."

"నేనూ అదే అనుకుంటున్నాను. నాయనా! ఇలా అనేకమంది బాధపడినవాళ్ళలో మన ఇరువురంకూడా. ఆ పెద్ద వీధికి ఎడమప్రక్కకు తిరిగి కొండమీదికి పొండి. అక్కడ మీకో హోటలు కనిపిస్తుంది. ఆహోటల్లో కూచోండి, నే నిప్పుడే వస్తాను."

బరువెక్కినహృదయంతో ఆ వృద్ధుడు వెళ్ళాడు. అతను మూల తిరిగిందాకా సిమాంగు మెల్లగా అతని వెంట వెళ్ళాడు. తరువాత వెనక్కు మళ్ళీ ఆ ఇంటికి వచ్చాడు. మళ్ళీ ఆవిడ తలుపుతీసింది. ఇందాకటి లాగానే చిరచిరలాడుతున్నట్లు కనిపిం

చిందింది. ఇప్పుడావిడ కొంచెం తేరుకున్నది. ఇప్పుడావిడలో భయంకంటె చిరాకు ఎక్కువ కనిపిస్తోంది.

"నేను పోలీసులకు సంబంధించినవాణ్ణి కాదు." అన్నాడతను: "పోలీసువాళ్ళతో నాకు పనిలేదు. వాళ్ళతో ప్రమేయం పెట్టుకోవాలనీ నేను కోరడంలేదు. కాని ఒక వృద్ధుడున్నాడు. తన కుమారుడు కనిపించనందువల్ల అతను కుమిలిపోతున్నాడు."

"అది ఏమాత్రం మంచిపనికాదు." అన్నదావిడ. కాని అందరూ అన్నట్లుగానే అన్నదావిడ ఈ మాట.

"అవును, మంచిపనికాదు." అన్నాడతడు: "నీవు ఏ విషయమైతే చెప్పలేదో ఆ విషయం చెప్పేదాకా నిన్ను నేను వదిలిపెట్టను."

"నేను చెప్పవలసిం దేమీలేదు." అన్నదావిడ.

"నీవు భయపడుతున్నావు. అందుకని చెప్పవలసిం దేమీలేదని అంటున్నావు. పోతే శీతలంవల్ల కాదు – నీ వలా వణికిపోయింది."

"మరి ఎందుకు వణికిపోయా నంటారు?" అని అడిగిం దావిడ.

"ఆ విషయం నాకు తెలీదు. కాని తెలుసుకునే దాకా నేను నిన్ను వదిలిపెట్టను. అవసరమైతే ఆఖరుకు పోలీసుల దగ్గరికి వెడతాను. అంతకంటే ఇహ ఎక్కడికని వెడతాను?"

"ఆడకూతురు ఒంటరిగా ఉండడం అవస్థ అయిపో యింది" అన్నదావిడ రోషపడుతూ.

"ఒక వృద్ధుడు తన కొడుకుకోసం వెదకడం కష్టంగా ఉన్నది."

"నాకు భయంగా ఉంది" అన్నదావిడ.

"అతనుకూడా భయపడుతున్నాడు. అతనెలా భయపడిపోయాడో నీవు చూడలేదూ?"

"చూచాను ఉమ్ఫున్‌డీన్"

"అయితే నాకు చెప్పు. వాళ్ళిద్దరూ – ఆ కుర్రవాళ్ళిద్దరూ ఇక్కడ ఎలాంటి జీవితం గడిపారు?"

కాని ఆవిడ మాట్లాడకుండా ఊరుకున్నది, ఆవిడ కళ్ళల్లో భయం నిండింది. కన్నీళ్ళ పర్యంతం అయింది. ఆవిడ కదలనైనా కదలలేకపోవడం అతను చూస్తూనే ఉన్నాడు.

"నేనొక మతగురువును. నా మాట నీవు విశ్వసించలేవా?" అని అడిగాడు మళ్ళీ అతను, కాని ఆవిడ అలాగే మాట్లాడకుండా ఊరుకున్నది.

"నీ దగ్గర బైబిల్ ఉన్నదా?"

"ఉన్నది" అన్నదావిడ.

"అయితే నేను బైబిల్ పట్టుక ప్రమాణం చేస్తాను"

కాని అప్పటికి కూడా ఆవిడ అలాగే ఊరుకున్నది. మళ్ళీ అతను రెండవమాటు "నేను బైబిల్ పట్టుకు ప్రమాణం చేస్తాను" అని అన్న తరువాత ఇహ ఆవిడ అలా ఊరుకోవడానికి మనస్కరించక అనిశ్చితంగా లేచి నిలుచున్నది. వెనకాల ఉన్న గదిలోకి వెళ్ళింది. కొంతసేపటికి బైబిల్ తీసుకుని తిరిగి వచ్చింది.

"నేను మతగురువును" అన్నాడతను. "నేను అవును అంటే ఎప్పుడూ అవునుగానే ఉంటుంది. నేను కాదు అంటే ఎప్పుడూ కాదు కాని నీవు కావాలని కోరినందువల్ల ఒక వృద్ధుడు భీతిచెందినందువల్ల నేను నీకీ పవిత్రగ్రంథంమీద ఒట్టు పెట్టుకుని చెపుతున్నాను. ఈ విషయంలో నీ కెలాటి చిక్కూ రాదు. మేం ఆ కుర్రవాణ్ణి వెదకడానికి మాత్రమే వచ్చాం. కనుక ఓ ఈశ్వరా! నాకు తోడ్పడు."

"వారిరువురూ ఎలాంటి జీవితం గడిపారో ఇప్పుడు చెప్పు?" అని అడిగాడతను.

"వాళ్ళు రాత్రిళ్ళు చాలా ప్రొద్దుపోయిన తరువాత అనేక వస్తువులు ఇక్కడికి పట్టుకొచ్చేవాళ్ళు ఉమ్ఫున్‌డీన్. గుడ్డలు, గడియారాలు, డబ్బు, సీసాలతో భోజనపదార్థాలు; ఇంకా ఎన్నెన్నో వస్తువులు తెచ్చేవాళ్ళు"

"ఎప్పుడైనా వాళ్ళవంటిమీద నెత్తురు కనపడిందా?"

"నెత్తురు నే నెన్నడూ చూడలేదు ఉమ్ఫున్‌డీన్."

"అది కొంతనయం. కొంతలో కొంతనయం — అయితే వాళ్ళు ఇక్కణ్ణుంచి ఎందుకు వెళ్ళిపోయారు?" అని అడిగాడతను.

"ఆ విషయం నాకు తెలీదు ఉమ్ఫున్‌డీన్. బహుశా వారు పట్టుబడేస్థితి వచ్చినందుల్లనే నేమో."

"అయితే వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో నీకు తెలీదని ఈ గ్రంథంమీద ప్రమాణంచేసి చెపుతావా?"

ఆవిడ బైబిల్‌ను తీసుకోవడానికి దగ్గరికి వచ్చింది. కాని అతను "పోనీ, మరేం అక్కర్లేదులే." అన్నాడు.

అత నావిడ దగ్గర సెలవుతీసుకుని త్వరత్వరగా తన స్నేహితుణ్ణి కలుసుకోవడానికై బయలుదేరాడు. కాని ఆవిడ వెనుకనుంచి అతన్ని పిలిచింది.

"వారిరువురికీ ఒక టాక్సీ డ్రైవర్‌తో స్నేహం కలిసింది. అతని పేరు ప్లాబెనీ. బస్సు స్టాండ్ దగ్గరే అతని కాపరం. అతన్ని అందరూ ఎరుగుదురు."

"చాలా సంతోషం. నమస్కారమమ్మా. వెళ్ళొస్తాను."

వెంటనే అతను హోటలు దగ్గరికే వెళ్ళి అక్కడ కని పెట్టుకునివున్న కుమారులోను కలుసుకున్నాడు.

"ఇంకా ఏమైనా విషయాలు తెలిశాయా?" అని అడిగాడు వృద్ధుడు, ఆతృతతో.

"వాళ్ళ స్నేహితుడొకతనున్నాడని విన్నాను. అతని పేరు ప్లాబెనీ. టాక్సీ డ్రైవర్ అట. సరే. నన్ను కొంచెం ఫల హారం తీసుకోనీయి. తరువాత వెళ్ళి విచారిద్దాం."

సిమాంగు ఫలహారం ముగించుకుని టాక్సీ డ్రైవర్ ప్లాబెనీ ఎక్కడ వుంటాడో తెలుసుకుందామని ఒకతని దగ్గరికి వెళ్ళాడు అతను "అదిగో, ఆ మూల టాక్సీ ఆపుకుని కూచు న్నాడే, ఆ టాక్సీలో కూచున్న అతనే ప్లాబెనీ." అని చెప్పాడు. వెంటనే సిమాంగు టాక్సీదగ్గరికి వెళ్ళి లోపల కూచున్న వ్యక్తిని పలుకరించాడు.

"నమస్కారం నాయనా."

"నమస్కారం ఉమ్ఫున్‌డీన్."

"నాయనా! నాకు టాక్సీ కావాలి. జోహానసుబర్గు వెళ్ళడానికి ఎంతబాడుగ తీసుకుంటావు? నేనూ, నా స్నేహితుడు – ఇద్దరం వున్నాం."

"ఉమ్ఫున్‌డిన్! మీకైతే పదకొండు షిల్లింగులు పుచ్చుకుంటాను."

"బాడుగ చాలా ఎక్కువ నాయనా."

"మరో టాక్సీవాడైతే పదిహేను లేక ఇరవైషిల్లింగులకు తక్కువరాడు."

"నా స్నేహితుడు వృద్ధుడు, బాగా అలిసిపోయాడు. నేను నీకు పదకొండు షిల్లింగులు ఇస్తాను."

అతను టాక్సీ బయలుదేరతీశాడు. కాని సిమాంగు అతన్ని ఆపి ఇలా అడిగాడు :

"అబ్‌సాలమ్‌కుమాలో అనే యువకుణ్ణి నీవు ఎరుగుదువని చెప్పగా విన్నాం. అతనెక్కడుంటాడో కొంచెం చెప్తావా?"

ఇతనుకూడా భయపడినట్లు స్పష్టంగా కనిపించింది. కాని సిమాంగు వెంటనే అతనికి నమ్మకం కలిగేటట్లు నచ్చచెప్ప ప్రయత్నించాడు.

"నే నిక్కడ ఎవర్నీ చిక్కుల్లో పెట్టడంకోసం రాలేదు. దీనివల్ల నీకుకాని నాకుకాని ఏ ఇబ్బందీ రాదని మాట ఇస్తున్నాను. కాని నా స్నేహితుడున్నాడు. అతను వృద్ధుడు. తిరిగి తిరిగి అలిసిపోయాడు. అత నీ కుర్రవాడి తండ్రి. కుమారుణ్ణి చూడడంకోసం నేటాల్‌నుంచి వచ్చాడు నాయనా. మేం ఎక్కడికి వెళ్ళి విచారించినా మరేదోచోటికి వెళ్ళమని

చెపుతున్నారు. పాపం ఆ వృద్ధుడు చాలా ఆతృతగా ఉన్నాడు."

"అవును. ఆ అబ్బాయి నాకు తెలుసును"

"అయితే వాడిప్పుడు ఎక్కడున్నాడు నాయనా?"

"ఆర్లాండోలో వెళ్ళాడని విన్నాను. అక్కడే పాంటీ టౌన్‌లో వలస జనంతో కలిసి ఉంటున్నాట్ట. అంతకంటె అతన్ని గురించి నాకేమీ తెలియదు."

"ఆర్లాండో చాలా పెద్దచోటు" అన్నాడు సిమాంగు.

"కాని ఊరూ పేరూలేని ఈ వలసజనం ఉండే ప్రదేశం ఏమంత పెద్దదికాదు ఉమ్‌ఫున్‌డీన్. అక్కడతన్ని కనుక్కోవడం అంత కష్టమైన పనికాదు. వారిలో మునిసిపాలిటీ క్రింద పనిచేసే వారుకూడా కొందరున్నారు. అంతా ఒకరినొకరు ఎరుగుదురు. వారిలో ఎవరినైనా అడిగి తెలుసుకోలేరూ ?"

"నీవు నాకెంతో ఉపకారం చేశావు నాయనా. వాళ్ళల్లో కొందరు నాకు తెలుసును. సరే, రా, నాయనా. నీ టాక్సీలో వస్తాం."

అతను కుమాలోను పిలిచాడు. ఇంటికి టాక్సీలో వెడుతున్నామని చెప్పాడు వారిద్దరూ టాక్సీలో ఎక్కారు. టాక్సీ అలెగ్జాండ్రా ప్రాంతంనుంచి బయలుదేరి కదిలింది. ప్రెటో రియానుంచి జోహానసుబర్గు వెళ్ళే విశాలమైన పెద్దరాస్తామీద నుంచి వెడుతోంది. ఇప్పటికి సాయంకాలమైంది. వచ్చేపోయే జనంతోను, బండ్లతోను రోడ్డు క్రిక్కిరిసి ఉంది. ఈ వేళప్పుడు ఈ రాస్తా జోహానసుబర్గునుంచి వచ్చే జనంతోను, పోయే జనంతోను కిటకిట లాడిపోతూ ఉంటుంది.

"ఆ బైస్కిళ్ళు చూచావా నాయనా? వీరంతా అలెగ్జాండ్రా జనం — కొన్ని వేలమంది జనం తమ పనిపాటలు ముగించుకుని సాయంత్రంవేళకు ఇళ్ళకు మరలుతున్నారు. అదిగో చూడండి. బస్సులు బాయ్‌కాట్ చేసినందున కొన్ని వేలమంది అలా నడిచిపోతున్నారు."

నిజానికి టాక్సీ ఎంతో దూరం వెళ్ళలేదు. పేవ్‌మెంట్ల మీద నడిచే జనం ఇసుకవేస్తే రాలకుండా ఉంది. పేవ్‌మెంట్లు పట్టక గుంపులు గుంపులుగా జనం రోడ్డుమీద నడుస్తున్నారు. కార్లు కదలడానికి వీల్లేక మెల్లగా, జాగ్రత్తగా నడుస్తున్నాయి. అలా నడిచివెళ్ళే జనంలో కొందరు వృద్ధులు, కొందరు అలిసిపోయి ఆయాసంతో ఎగరొప్పుతున్నారు. కొందరు కుంటివాళ్లు, గ్రుడ్డివాళ్ళు, అంగహీనులు. గతకొద్ది వారాలనుంచీ బస్సుల్లేనందువల్ల వారిలో చాలామంది ఇలాగే అంతంత దూరం నిశ్చితంతో నడిచివెడుతున్నారు, వస్తున్నారు. చాలా మంది తెల్లవాళ్ళు తమ కార్లు ఆపారు. అలెగ్జాండ్రాకు నడిచి వెళ్ళే నల్లవాళ్ళను తమ కార్లలో ఎక్కించుకున్నారు. కాని ఒకచోట ఒక విషయం జరిగింది. వారి టాక్సీ ఆగినచోటికి కొంచెం ఎడంగా ఒక ట్రాఫిక్ ఆఫీసరు జనాన్ని కార్లో ఎక్కించుకుంటున్న తెల్లవాడి దగ్గరికి వచ్చి "నల్లవాళ్ళను కార్లో ఎక్కించుకుని తీసుకపోవడానికి నీకు లైసెన్సు ఉన్నదా?" అని అడిగాడు.

"నేను వారిదగ్గర డబ్బేమీ వసూలు చెయ్యడంలేదు." అన్నాడు ఆ తెల్లవాడు.

"కాని నీవు బస్సురూట్‌లో, ప్రయాణీకులను కార్లో ఎక్కించుకుని తీసుకపోతున్నావు" అన్నాడు మళ్ళీ ఆఫీసరు.

"కావాలంటే నన్ను కోర్టుముందు హాజరు పెట్టు" అన్నాడా తెల్లమనిషి.

ఆ తరువాత ఏంజరిగిందో వారిద్దరికి వినిపించలేదు. అప్పటికి లైట్లు ఆకుపచ్చ వర్ణానికి తిరిగినందున టాక్సీ మళ్ళీ అక్కడనుంచి కదిలింది.

"ఆ జరిగిన సంభాషణ నేను విన్నాను" అన్నాడు సింహాంగు. ఆ తెల్లవాళ్ళు మన నల్లవాళ్ళను తమ కార్లలో ఎక్కించుకుని సహాయపడుతుంటే ఈ అధికార్లు అడ్డు చెప్తున్నారు. వాళ్ళను కోర్టుకు ఈడ్చుకవెళ్ళడానికి కూడా సిద్ధపడుతున్నారు

ఇప్పటికి చీకటిపడుతోంది. అయినా యింకా అలెగ్జాండ్రాకు మరలివెళ్ళే జనంతో రాస్తా సందడిగానే ఉంది. ఇప్పటికీ ఇంకా కొందరు తెల్లవాళ్ళు మధ్య మధ్య తమ కార్లు ఆపి నల్లవాళ్ళను ఎక్కించుకుపోతున్నారు, ముఖ్యంగా వృద్ధులను, స్త్రీలను, అంగహీనులను అవిటివాళ్ళను చేతులందించి కార్లలో ఎక్కించుకపోతున్నారు. కుమాలో ముఖంలో మందహాసం తాండవించింది. అదొక అపురూపమైన మందహాసం. ఏ ఇతర దేశాల్లోనూ ఎరుగని మందహాసం పదిమందిలో, బాహాటంగా ఒక నల్లజాతివాడు ఒక తెల్లజాతివానివల్ల సహాయం పొందడం కుమాలో కళ్ళారా చూచాడు. ఇది అంత సులభంగా జరిగే పనికాదు. అందుకే అతని ముఖంలో మందహాసం తాండవించింది. అత నా దృశ్యాన్ని తలుచు

కుంటూ అందులో లీనమైనాడు. అంతలో ప్రక్కనున్న సిమాంగు హఠాత్తుగా ఇలా అనేసరికి అతను నిర్ఘాంతపోయాడు

"అది నాకు దిగ్భ్రమ కొలుపుతోంది నాయనా" అన్నాడు సిమాంగు.

"ఏమిటది? ఆడదయా?"

"కాదు, కాదు. నిజానికి నే నా విషయం ఆలోచించడమే లేదు."

అతను అలాగే టాక్సీలో కూచుని, చేత్తో తన ఎదు ర్రొమ్ముమీద గట్టిగా గుద్దుకున్నాడు.

"కావాలంటే నన్ను కోర్టుముందు హాజరుపెట్టు." అన్నాడతను. ఇలా అని కుమాలోవంక చూచాడు. అతని చూపులు మిరుమిట్లు గొలుపుతున్నాయి. మళ్ళీ చేత్తో తన గుండెలమీద గుద్దుకున్నాడు. "కావాలంటే నన్ను కోర్టు ముందు హాజరుపెట్టు." అన్నాడు.

కుమాలో దిగ్భ్రాంతిచెంది అతనివంక చూచాడు.

"నాకు ఆశ్చర్యం కలిగించేది అదే నాయనా." అన్నాడు సిమాంగు.

౯

అన్ని మార్గాలూ జోహానసుబర్గు నగరానికే త్రోవ తీస్తాయి. మీరు తెల్లజాతివారు కాని లేక నల్లజాతివారు కాని, ఎవరైనాసరే జోహానసుబర్గు వెళ్ళాలి. పంటలు పోతే జోహానసుబర్గులో పని దొరుకుతుంది. పన్నులు చెల్లించాల్సి ఉంటే జోహానసుబర్గులో పనిదొరుకుతుంది. పొలం చాలా

కొద్దిగా ఉండి అందులోకూడా భాగం పంపిణీలు చేసుకోవలసి ఉంటే కొందరు జోహానసుబర్గు వెళ్ళితీరాలి. ఒక స్త్రీ గర్భవతి అయి రహస్యంగా బిడ్డను కనవలసిఉంటే ఆ పని చెయ్యడానికి జోహానసుబర్గులో కావలసినంత వీలున్నది.

నల్లజాతిప్రజలు అలెగ్జాండ్రాకో లేక సోఫియా టౌనకో లేక ఆర్లాండోకో వెడతారు. అక్కడ గదులు అద్దెకు తీసుకోవడానికి కాని లేక ఒకఇంట్లో కొంతభాగం కొనుక్కోటానికి గాని ప్రయత్నిస్తారు.

"మీ ఇంట్లో గదిఏమైనా అద్దెకు దొరుకుతుందా?"

"లేదు. మా యింట్లో గదిలేదు"

"మీ ఇంట్లో గది ఏమైనా అద్దెకు దొరుకుతుందా?"

"ఇదివరకే అద్దె కిచ్చేశాం."

"మీ ఇంట్లో అద్దెకిచ్చే గదులేమైనా ఉన్నాయా?"

"ఆ. ఒకగది ఉన్నది. కాని ఆ గది అద్దెకివ్వడం నా కిష్టం లేదు. మాకు రెండే రెండు గదు లున్నాయి. ఇప్పటికే ఇంట్లో ఆరుగురు మనుష్యులం అయ్యాం. ఇంకా అబ్బాయిలు, అమ్మాయిలు ఎదిగివస్తున్నారు. కాని బళ్ళో పుస్తకాలకు బోలెడు డబ్బు అవుతోంది. నా భర్త మంచానపడ్డాడు. ఆయన బాగా తిరిగి సంపాయించే రోజుల్లోకూడా వారానికి ముప్పయి అయిదు షిల్లింగులుమాత్రమేవచ్చేవి. అందులో ఆరు షిల్లింగులు అద్దెకిందపోతాయి. మూడుషిల్లింగులు రాక పోకలకు బస్సుచార్జీలక్రింద, మరొకషిల్లింగు మేమంతా కాస్త మర్యాదగా బ్రతకడానికి ఖర్చు అవుతాయి. పోతే ఒక

షిల్లింగు పిల్లల పుస్తకాలకు, ఎంత క్లుప్తంగా సర్దుకున్నా మరో మూడు షిల్లింగులు మా బట్టలకు అయిపోతాయి. ఒక్క షిల్లింగు మా ఆయన బీరు త్రాగడానికి, ఆయన పొగాకు ఖర్చు పెట్టుకుంటాడు. అయినా ఈ కాస్త దానికి ఆయనతో నేను సణుగుతూ కూచోను. ఆయన మంచివాడు, మర్యాదస్థుడు. జూదమాడడం కాని, పరాయి స్త్రీలతో తిరగడంకాని; ఇలాంటి దుర్వ్యసనాలు ఆయనకు లేవు. పోతే ఒక షిల్లింగు చర్చికి వెళ్ళడానికి, మరోషిల్లింగు మా రోగాల క్రింద నొప్పులక్రింద ఖర్చవుతుంది. ఇహ మిగిలేదల్లా పదిహేడు షిల్లింగులు. అది మా తిండికి సరిపోతుంది. మాటలా ఆరు పొట్టలు నిండాలి దరిద్రానికి ఆకలెక్కువన్నట్లు మా పొట్టలు పెద్దవి. ఆ డబ్బుసరిపోక ఎప్పుడూ సగం ఆకలితో సతమతమవు తుంటాం. అవును. మా ఇంట్లో గది ఉంది. కాని అది అద్దె కివ్వడం నా కిష్టం లేదు. అయినా మీరెంత అద్దె పెడతారు?"

"ఒకగదికి వారానికి మూడు షిల్లింగులు ఇవ్వగలను."

"నా కక్కర్లేదు"

"పోనీ మూడున్నర షిల్లింగులు?"

"మూడున్నర షిల్లింగులు" ఇలా ఒక్కళం గుట్టు చక్కగా ఉండాలంటే పొట్టగడవదు. పిల్లలు పెరిగి పెద్ద వాళ్ళు అవుతున్నారు. ఒకరితో పొత్తు కలవకుండా ఒంటరిగా ఉండవలసిన అవసరమున్నది. కాని ఇలా ఉంటే తమ పొట్టలు గడవడం కష్టం. "అవును. మూడున్నర షిల్లింగులు తీసుకుని గది అద్దెకిస్తాను.

ఇప్పుడు ఇల్లు విచ్ఛిన్నం కాలేదు కాని ఇల్లుపట్టకుండా జనం వున్నారు. రెండుగదుల ఇంట్లో పదిమంది మనుష్యులు. అందరికీ ఒకే వాకిలి. నీవు పడుకుని నిద్రపోతుంటే జనం నీ మీదుగా నడిచి వెళ్ళాలి. కాని పిల్లలకు మరికొంచెం అన్నం దొరుకుతోంది. నెలకొకమాటు సినిమాలకు వెళ్ళడానికి కూడా వీలున్నది.

ఈ ఆడమనిషి అంటే నాకిష్టంలేదు. ఈవిడ నా భర్త వైపు చూచే తీరుచూస్తే నాకు బొత్తిగా గిట్టడంలేదు.

ఈ అబ్బాయి అంటే నాకసలు ఇష్టంలేదు. ఇతను మా అమ్మాయివంక అదోలా చూస్తున్నాడు. ఇతనంటే నాకు నచ్చదు. ఇతను నావంక, నా కూతురువంక అదేపనిగా చూస్తున్నాడు.

"క్షమించండి. మీరిక ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి."

"వెళ్ళడానికి మాకు వేరే చోటు లేదు."

"క్షమించండి ఇంట్లోమసలడానికి వీలులేకుండా జనం అయిపోయారు. మహా కిబ్బందిగా వుంది. నే మీ బాధ భరించలేం."

"మేం ఒక ఇంటికోసం ప్రయత్నిస్తున్నాం — పేరు కూడా నమోదు చేయించాం. మాకా ఇల్లు వచ్చేదాకా కొంచెం ఆగలేరూ?"

"అయిదేండ్లబట్టీ ఇల్లు ఇల్లని కలవరిస్తూ కనిపెట్టుకుని ఉన్నజనం అనేకమంది ఆర్లాండాలో ఉన్నారు."

"నా స్నేహితుడొకతను ఒక్క నెలలో ఇల్లు సంపాయించుకున్నాడు."

"అలాంటివి నేనూ విన్నాను. కాని లంచం పోస్తే అలా తటస్థపడుతుందని చెపుతున్నారు"

"లంచం ఇవ్వడానికి మాదగ్గర డబ్బులేదు"

"క్షమించండి. మీరు తక్షణం మా ఇల్లు ఖాళీ చెయ్యాలి. మాకిక్కడ జాగాలేదు."

"అవును. ఆ ఇంట్లో జాగాలేదు. ఆ ఇంట్లో మనిషి మీద మనిషి వున్నారు. ఈ ఇంట్లో మనిషి మీద మనిషి వున్నారు. అవును. ఎక్కడెక్కడివాళ్ళూ జోహానసుబర్గు నగరానికి ఎగబ్రాకితే ఇళ్ళు ఎక్కడుంటాయి? ట్రాన్సుసీలు నుంచి, ఫ్రీ స్టేట్ నుంచి, జూలూలాండ్ నుంచి, సెకుకునీలాండ్ నుంచి; అన్నిచోట్లనుంచీ జనం ఇక్కడికే రావడం. జూలూజాతివారు, స్వాజీలు, షాంగానులు, బవెండాలు, బపేడీలు, బసూటాలు, కోసాలు, టెంబూలు, పాండోలు, ఫింగోలు; అందరూ జోహానసుబర్గుకే వచ్చిపడుతున్నారు.

ఈ స్త్రీ అంటే నాకు ఇష్టంలేదు. ఈ అబ్బాయి అంటే నాకు ఇష్టంలేదు. ఇతనంటే నాకు ఇష్టంలేదు. క్షమించండి. మీ రెలాగైనా తక్షణం మా ఇల్లు ఖాళీచెయ్యాలి.

"ఒక్కవారం ఆగండి. అంతే నేను మిమ్మల్ని కోరేది."

"సరే. ఇంకొక్క వారం ఉండనిస్తాను."

* * *

"మీ ఇంట్లో అద్దెకిచ్చేగది ఏమైనా వుందా?"

"లేదు అద్దె కిచ్చేగదేమీ లేదు."

"మీ ఇంట్లో అద్దెకిచ్చేగది ఏమైనా వుందా ?"

"ఉంటే ఇదివరకే యిచ్చేశాం"

"మీ యింట్లో అద్దెకిచ్చే గది ఏమైనా ఉందా ?"

"అవును వుంది. ఒక గదివుంది. కాని అద్దెకివ్వాలని లేదు. ఎంచేతనంటారా? ఆడవాళ్ళు పరాయి మొగుళ్ళను లేవతీసుకుని పోవడం నా కళ్ళారా చూచాను. అలాగే మగ వాళ్ళు పరాయి ఆడవాళ్ళను లేవతీసుకొని పోవడమూ చూచాను. కుర్రవాళ్ళు వచ్చి కుమార్తెలను చెడగొట్టటం ఆడపిల్లలు వచ్చి కుమాళ్ళను చెడగొట్టడం ఈ కళ్ళతోనే చూచాను. కాని నా భర్త సంపాదన వారానికి మూప్ఫనాలుగు షిల్లింగులు మాత్రమే.

"మా కెక్కడా యిళ్ళులేవు. మమ్మల్ని ఏంచేయ మంటారు?"

"ఏంచేస్తారు? ఒక్క యింటికోసం అయిదేండ్లు ఆగాలి. కాని మీరు ఆగినకొద్దీ అది యింకా ఆలస్యమవుతుంది"

"స్వంత యిళ్ళులేక పరాయి యిళ్ళలో ఉంటున్న మన జాతివాళ్ళు ఒక్క ఆక్లాండ్‌లోనే పదివేలమంది ఉన్నా రని చెపుతున్నారే !"

"అవును. దుబులా చెప్పింది మీరు వినలేదూ ? మనం ఆక్లాండ్‌లో స్వంత యిళ్ళుకట్టుకోవాలని చెప్తు తున్నాడు"

"గాని యిళ్ళు ఎక్కడ కట్టుకుంటాం?"

"రైల్వేలైను ప్రక్కన ఖాళీజాగాలో కట్టుకోవాలని దుబులా చెపుతున్నాడు"

"కాని యిళ్ళు దేనితో కట్టుకుంటాం?"

"దేంతో ఏమిటి? ఏది దొరికితే అదే. గోనెసంచులు, బల్లచెక్కలు, మైదానాల్లో గడ్డి, కొయ్యలు, చెట్లకొమ్మలు యివన్నీ పెట్టి కట్టుకోవచ్చు"

"మరి వర్షంవస్తే?"

"సీమాషా—మనం చచ్చి ఊరుకుంటాం"

"కాదు వర్షాకాలంలో వాళ్ళు మనకు ఇళ్ళు కట్టి పెట్టాలి"

"అది వట్టి తెలివితక్కువ ఆలోచన. మరి మనం శీతా కాలంలో ఏంచేస్తాం?"

ఒక యింటికోసం ఆరేండ్లబట్టీ కనిపెట్టుకుని ఉంటు న్నారు. ఉన్న యిళ్ళు జనంతో ఊపిరాడకుండా ఉన్నాయి. జనసంఖ్య ఇంకా ఇంకా పెరుగుతోంది. జనం ఇంకా ఇంకా జోహానుస్బర్గు నగరంమీద ఎగబడుతున్నారు. ఇళ్ళకోసం అల్లాడుతున్నారు. యూరప్‌లోను ఉత్తరాఫ్రికాలోను ఒకపెద్ద యుద్ధం చెలరేగుతోంది అయినా ఇళ్ళుకట్టలేదు.

"ఇప్పటికైనా నాకో ఇల్లువచ్చే అవకాశం ఉందా?"

"లేదు ఇంకా ఇప్పుడప్పుడే వచ్చేఅవకాశం లేదు."

"పోనీ, అసలు నా పేరు లిస్టులో ఉన్నదంటారా?"

"ఆ. మీ పేరు లిస్టులో ఉన్నది."

"లిస్టులో నేను ఎన్నో వాణ్ణి? – నా నెంబరెంత?"

"ఏమో ఆ విషయం చెప్పలేను. కాని – మొత్తానికి మీ నెంబరు ఆరువేల పైచిలుకు ఉంటుంది."

లిస్టులో ఆరువేలమంది ఉన్నారు. నా సంఖ్య ఆరువేల పైచిలుకు – అంటే దానిఅర్థం నాకెప్పటికీ ఇల్లు రాదన్నమాట. పోతే ఇప్పుడు నేనున్నచోట ఇహా ఎంతోకాలం ఉండడం అసాధ్యం. ఇప్పటికే వాళ్ళకూ మాకూ చాలా తగువులయి నాయి. స్టౌ దగ్గర తగాదా, పిల్లలవిషయంలోతగాదా ఆఇంటి మగవాడు నా వంక అదోలా చూస్తాడు. నా కేమాత్రం బాగా లేదు, రైల్వేలైనుప్రక్క ఖాళీ జాగాఉన్నది. కాని వర్షం వచ్చినా, శీతాకాలంలోను ఆ ఆరుబయట ఎలాఉండడం? వాళ్ళు మమ్మల్ని అక్కడికి వెళ్ళిపొమ్మని చెప్తారు, అందర్నీ కలిసి వెళ్ళమని చెప్తారు. ఇవాల్టినుంచి పద్దాలుగు రోజులలోగా వెళ్ళాలట. బల్ల చెక్కలు, గోనెసంచులు, సీనా రేకులు. డబ్బాలు, కర్రలు, గడలు; ఇవన్నీ తెచ్చుకుని అందరినీ కలిసి అక్కడికి వెళ్ళిపొమ్మంటున్నారు. మేమంతా వారానికి ఒక షిల్లింగుచొప్పున కమిటీవారికి చెల్లించాలని చెప్తున్నారు అప్పుడు వాళ్ళు మా చెత్త, చెదారమంతా కదిలించి, మేము రోగాలపాలవకుండా మా కోసం మరుగు దొడ్లు కడతారట. కాని మరి వర్షంమాట, శీతాకాలంమాట ఏమిటి ?

"ఇప్పటికైనా నాకో ఇల్లుదొరుకుతుందా?"

"ఇప్పు డప్పుడే దొరకదు."

"కాని నాపేరు రెండేండ్లబట్టీ లిస్టులో ఉన్నదండీ."

"ఇలాంటిపేర్లు లిస్టులో చాలాఉన్నాయి. నీ వేమిటి గొప్ప?"

"మీ కేదో డబ్బిస్తే ... అది నిజమేనా?"

కాని అతను నా మాట వినిపించుకుంటేనా? నాలాంటి వాళ్ళు అనేకమంది – అప్పుడే మరెవరితోనో మాట్లాడుతూ తీరిక లేకుండా ఉన్నాడు. కాని మరో అతను నాదగ్గరికి రానే వచ్చాడు. ఎక్కడనుంచి వచ్చాడో నేను చూడలేదు. అతని మాటలకు నేను దిగ్భ్రాంతి చెందాను.

"మిసెస్. సెమీ! వాళ్ళ ఇల్లు లేనందుకు విచారిస్తున్నాను. అన్నట్లు నా భార్య, కమిటీవాళ్ళు చేసేపనిని గురించి నీతో మాట్లాడాలను కుంటోంది. ఇవాళరాత్రి ఏడుగంటలకు నిన్ను రమ్మని చెప్పింది. నీకు మా ఇల్లు తెలుసుగా? డచ్ సంస్కరిత చర్చిదగ్గర. ఇంటి నెంబరు 17852. చూడు! నీ నెంబరు రాసుకుని గుర్తుపెట్టు కుంటానులే. గుడ్ మార్నింగ్, మిసెస్. సెమీ."

కాని నేను సమాధానం చెప్పేలోపుగా నే అతను అక్కడనుండి వెళ్ళిపోయాడు.

"ఓ! కాని ఇతనెవరో? తలుచుకుంటే నాకు గాభరా పుడుతోంది. ఇతని భార్య ఎవరు? ఆవిడ ఎవరో నాకు తెలియదే. పోతే ఈకమిటీ ఏమిటి? ఏకమిటీ వాళ్ళను గురించీ నాకు తెలీదు"

"ఓ! నీవెంత వెర్రిబాగుల దానవమ్మా! అతను నీకు ఇల్లు ఇప్పిస్తే అందుకు నీవెంత డబ్బిస్తావో – ఆవిషయం నీతో మాట్లాడాలని కోరుతున్నాడు."

అయితే సరే. నేనక్కడికి వెడతాను. అతనంత మరీ మితిమీరి అడుగుతాడని నే ననుకోను. వారానికి ముప్ఫయి

ఏడు షిల్లింగులు సంపాయించే మనిషి ఏపాటి డబ్బు ఇవ్వ గలుగును? కాని మాకు ఇల్లు అత్యావసరం. మేం ఇప్పుడున్న ప్రదేశం తలుచుకుంటే నాగుండె గుబేలుమంటున్నది. మర్యాదగా కాపురాలు చేస్తున్న వాళ్ళంతా నిద్దర్లు పోయినతరువాత అక్కడి కెవరో రావడం పోవడం జరుగుతోంది—అంత రాత్రి వేళ అనేకమంది యువకులు రావడం, పోవడం. చూడబోతే వాళ్ళు నిద్దర్లు పోనట్లుంది. వాళ్ళకు వేరే పనేమీ లేనట్లుంది. గుట్టలు గుట్టలు గుడ్డ తెస్తున్నారు—ఒకటో రకంగుడ్డ. తెల్ల వాళ్ళు ధరించేగుడ్డ. ఏదో ఒకనాడు చిక్కుల్లోపడక తప్పదు. ఇంతవరకు నేను, నా భర్త అలాంటి చిక్కుల్లోపడి ఎరుగం. మేం తక్షణం వేరే ఇల్లు చూచుకోవాలి.

* * *

"అయిదు పౌనులంటే చాలా ఎక్కువ. అంత డబ్బు నాదగ్గరలేదు"

"ఒక ఇంటికోసం అయిదు పౌనులివ్వడమంటే ఒక లెక్కలోది కాదు మిసెస్. సెమీం."

"ఏమిటీ? నా పేరు లిస్టులో క్రిందినుంచి తీసి పైన పెట్టడానికా?"

"కాని ఆపని చెయ్యడం ఎంత ప్రమాదకరమో తెలుసునా? మా మేనేజరు ఇక్కడివాడు కాదు. యూరోపియన్. ఎవరైనాసరే, లిస్టును ఏమాత్రం తారుమారు చేసినా తీవ్రంగా చర్య తీసుకుంటానని చెప్పాడు."

"కావచ్చు. కాని క్షమించండి. అంతడబ్బు నేనిచ్చుకోలేను."

కాని నేనిక్కడనుంచి వెళ్ళిపోకముందే ఆయన భార్య మరో ఆడమనిషిని వెంటబెట్టుకుని ఆ గదిలోకి వచ్చింది.

"ఏమండీ! మీరు పొరపడ్డారు. ఈవిడ ఎవరో నేనెరుగను. ఈవిడ కమిటీపైన వున్న ఆవిడ కాదు."

"ఓ! క్షమించు...క్షమించు మిసెస్. సెమిరా. నీవు కమిటీపైన ఉన్న మనిషివని అనుకున్నాను. సరే, వెళ్ళమ్మా" అన్నాడతను.

కాని నా క్షేమమాత్రం బాగాలేదు. వాళ్లు బాగున్నా ఓగున్నా నాకక్కర్లేదు. ఎటు చూచినా నా పరిస్థితి అయోమయంగా ఉంది. అలిసిపోయాను. ఒంటరివాణ్ణయ్యాను. ఓ! మా ఆయన. అయ్యో! మనం మన ప్రాంతాన్ని మన జనాన్ని వదిలిపెట్టి యిక్కడికెందుకొచ్చామండీ? మనకక్కడ అంతగా జరుగుబాటులేదు నిజమే. కాని యిక్కడికంటె నయం. అక్కడ అంతగా తిండిలేదు కాని వున్నదేదో అందరం తలాకాస్త తింటాం. అందరూ పేదవాళ్ళయితే - పేదవాళ్ళు కావడంవల్ల పెద్ద చెడుగేమీలేదు, మన ఊళ్ళో, మన నది ఒడ్డున ఎంతో హాయిగా ఉండేది. మనంబట్టలు ఉతుక్కుంటూ వుంటే రాళ్ళల్లోనుంచి నదీజలాలు గలగలమని ప్రవహిస్తూ ఉండేవి. చల్లని చిరుగాలి వచ్చి మన శరీరాలకు తాకేది. మనం యిక్కడనుంచి వెళ్ళిపోవలసిన రోజు సరిగ్గా ఇవాల్టికి రెండువారాలున్నది. రండి. బల్లచెక్కలు, సీనారేకులు,

డబ్బాలు, గోనెసంచులు, కర్రలు, గడలు తెచ్చుకుని ఇక్కడ నుంచి వెళ్ళిపోదాం. ఇప్పుడు మనం వున్నచోటు నాకే మాత్రం యిష్టంగా లేదు.

బరగ్వానాథ్ ఆస్పత్రి దగ్గర బల్లచెక్క లున్నాయి. ఇల్లు కట్టుకునేవాళ్ళు అక్కడ వాటిని వదిలిపెట్టి పోయారు. ఇవాళరాత్రే మనం అక్కడికివెళ్ళి వాటిని మోసుకొచ్చుకుందాం. పిల్లల జైలుదగ్గర ముడతలుగా చేసిన యినుప రేకులు పడివున్నాయి. వాళ్ళు వాటిని యిటుకలబట్టీ కప్పడానికి వుపయోగించుకొనేవారు. మనం రాత్రేవెళ్ళి వాటిని తెచ్చుకుందాం. క్రౌన్ గనుల దగ్గర కాలువనిండా చెట్లున్నాయి. మనం ఈ రాత్రే వెళ్ళి మెల్లగా కాసిని కొమ్మలు కొట్టుకొచ్చుకుందాం

*　　　*　　　*

ఆర్లాండోలో వాళ్ళంతా ఈ రాత్రి హడావుడిలో వున్నారు. తీరికన్న మాటలేదు. ఒక యింటి తరువాత ఒక యిల్లు - అన్ని యిళ్ళలోనూ దీపాలు వెలుగుతున్నాయి. నేను యినుపరేకులు మోసుకొస్తాను. ఏమేవ్! నీవూ మన అబ్బాయి వెళ్ళి చెరొక గడ ఎత్తుకరండి. ఓరేయ్, చిన్నవాడా! నీవు వెళ్ళి మోయగలిగినన్ని గోనెసంచులు పట్టుకెళ్ళి అన్నీ ఆ రైల్వేలైనుప్రక్కన పల్లంలో వున్న ఖాళీజాగాలోకి చేర్చండి. చాలామంది అప్పుడే అక్కడికి వెళ్ళిపోతున్నారు. అదిగో, వినపడడంలేదు. చప్పుళ్ళు అవుతున్నాయి. అప్పుడే కొందరు నేలత్రవ్వగింజలు పాతుతున్నారు. మేకులుకొట్టి

రేకులు బిగిస్తున్నారు. ఇవాళరాత్రికూడా చాలా బాగుంది. చలిలేదు. మబ్బు, మసకలేదు. నమస్కారం మిస్టర్ దుబులా! ఈ కాస్త నేల చాలు మాకు. దీంతో తృప్తిపడతాం...నమస్కారం దుబులా! కమిటీవాళ్ళ కివ్వాల్సిన మా ఒక షిల్లింగు ఇదిగో.

రాత్రికిరాత్రి షాంటీటౌన్‌లో ఇళ్ళు తయారైపోయినాయి. తెల్లవారగానే జనం లేచిచూచి ముక్కుమీద వ్రేలేసుకున్నారు - ఏమిటీ చోద్యం! గోనెసంచుల్లోనుంచి పొగ పైకిలేస్తోంది ఒకరో ఇద్దరో అప్పుడే పొగగొట్టాలుకూడా పెట్టుకున్నారు. అరెరె! క్లిప్‌టౌన్ పోలీసుస్టేషన్‌దగ్గర ఒక చక్కటి పొగగొట్టం పడిఉంటే చూచాను. ఎంత వెర్రివాణ్ణి! ఎత్తుకొచ్చుకుంటే ఎంతబాగుండేది!

రాత్రికిరాత్రి షాంటీటౌన్‌లో ఇళ్ళు లేచాయి. వార్తా పత్రికలనిండా మమ్మల్ని గురించే. పెద్దపెద్దమాటలు వ్రాశారు. పెద్దపెద్ద బొమ్మలు వేశారు. అదిగో! ఆ బొమ్మలో చూడండి. ఇంటిపక్కనే ఇంచక్కా నిలుచున్నాడే! ఆయనే నా భర్త. అయ్యొయ్యొ నేను ఆలస్యంగా వచ్చానయ్యా. లేకపోతే నేనూ బొమ్మలో పడిఉండును. మమ్మల్ని 'ఊరికే తిష్టవేసిన వాళ్ళు' అంటారు. నిజంగా అంతే. గోనెసంచులతో, బల్ల చెక్కలతో, ఇనుపరేకులతో తయారైంది ఈ పెద్ద ఊరు. దీనికి బాడుగచెల్లించవలసిన పనిలేదు. కమిటీవాళ్ళకు ఒక్క షిల్లింగు మాత్రం ఇవ్వాలి

రాత్రికిరాత్రి షాంటీటౌన్‌లో ఇళ్ళులేచాయి చంటిపిల్ల నోరు మూతపడకుండా దగ్గుతోంది, జ్వరం మండిపోతోంది.

పిల్లను అక్కణ్ణుంచి కదిలిద్దామన్నా భయంగానే ఉంది. ఈ అర్ధరాత్రివేళ ఎక్కడికి తీసుకెళ్ళను? ఈగోనెపంచుల్లోనుంచి చల్లని చలిగాలి వచ్చి జివ్వున తాకుతోంది. శీతాకాలం లోను, వర్షం వచ్చినప్పుడు మేం ఏం చెయ్యాలి? పడుకోవే నా చిట్టితల్లీ! నేను మీ అమ్మనుకదూ! నీ ప్రక్కనే ఉన్నాను తల్లీ. కాస్త అణిగి పడుకోవేఅమ్మా. దగ్గు నోరు మూతపడకుండా ఉంది. నా చిట్టివికదూ? నేను నీ ప్రక్కనే ఉన్నాను కదమ్మా.

చంటిపిల్లకు దగ్గు నోరుమూతపడటం లేదు. పిల్ల పళ్ళు పేలాలు వేయిస్తున్నట్లు వేసుకుంటోంది. పడుకోవేతల్లీ — కాస్త అణిగి పడుకోఅమ్మా. నేను నీదగ్గరే ఉన్నానుగా. బయట ఒకటే నవ్వులు, పరాచకాలు. గుంజలు పాతేవాళ్ళు, మేకులు కొట్టేవాళ్ళు— ఒకటే చప్పుడు. ఏమిటో పిలుపులు, మాటలు వాళ్ళ భాష నాకర్థంకాదు. అణిగి పడుకోవేతల్లీ! ఒక సుందరమైన లోయ ఉన్నది. ఆ లోయలోనేతల్లీ నువ్వు పుట్టింది. రాళ్ళపై గలగల ప్రవహించే సెలయేళ్ళ గానం వినిపిస్తుంది తల్లీ అక్కడ. అక్కడ చల్లని మెల్లని చిరుగాలి వచ్చి తాకుతుంది. పశువులు నదిదగ్గరికి వస్తాయి. అందులో నీళ్ళు త్రాగి ఒడ్డునఉన్న చల్లని చెట్లక్రింద నిలుచుంటాయి. అటువంటిచోట పుట్టావమ్మా నువ్వు. నిద్రపోతల్లీ, నిద్రపో. భగవంతుడా! నా చిట్టితల్లిని నిద్రపుచ్చు. ఈశ్వరా! మమ్మల్లను కరుణించు. క్రీస్తుప్రభూ! మమ్ముల్ను కరుణించు. తెల్లవాడా! మమ్మల్లను కరుణించు.

* * *

"మిస్టర్ దుబులా! డాక్టర్ ఎక్కడున్నాడు?"

"ఉదయాన్నే వెళ్ళి డాక్టర్‌ను తీసుకొస్తాం. నీవేం భయపడక్కర్లేదు. డాక్టర్ ఫీజు కమిటీవాళ్ళే ఇస్తారులే."

"కాని పిల్ల బ్రతికేటట్లు లేదు. చూడు! వంట్లో నెత్తురు లేదు—రంగే మారిపోయింది."

"ఈ కాసేపట్లో ఏం ముంచుకుపోదు — తెల్లవారగానే......"

"పిల్లకు ముంచుకొచ్చి చాలా కాలమైంది నాయనా. ఏనాడైతే బిడ్డ జడుసుకున్నదో ఆనాడే దాని చావు మొదలయింది. ఇప్పుడు వెడితే డాక్టర్ రాడా దుబులా?"

"ప్రయత్నించి చూస్తానమ్మా. ఇప్పుడే వెళ్ళి ప్రయత్నం చేస్తాను."

"వెళ్ళు నాయనా, ని కడుపు చల్లగాను."

బయట పాటలు వినిపిస్తున్నాయి — చలిమంట చుట్టూ కూచుని పాటలు పాడుతున్నారు: "ఈశ్వరుడు ఆఫ్రికాను కాపాడు గాక!" అని వాళ్ళు పాడుతున్నారు. ఆఫ్రికాలో ఈ కాస్తనేల నాది, నా స్వంతం. దీనికోసం పడరాని పాట్లు పడ్డాను. దీనికోసం నా శరీరం, నా శక్తి, నా రక్తం ధారపోశాను. ఈ నేలను హృదయపూర్వకంగా ప్రేమించాను. అవును, స్త్రీల స్వభావమే అంత. దీన్ని ఈశ్వరుడు కాపాడుగాక! నా చిట్టితల్లీ! కాస్త అణిగిపడుకో అమ్మా. డాక్టర్! మీరు వచ్చి నా బిడ్డను చూడరూ?

"డాక్టర్ కోసం కబురు చేశానమ్మా. కమిటీవాళ్ళు డాక్టర్ కోసం ఒకకారు పంపారు. అతను నల్లడాక్టర్-మన జాతివాడే."

"మంచిది దుబులా, నీ మేలెన్నటికీ మరువలేను నాయనా"

"వాళ్ళను కాస్త చప్పుడు చెయ్యొద్దని చెప్పనా అమ్మా?"

"ఫరవాలేదులే నాయనా; ఆ చంటిదానికి అదేమీ తెలీదులే."

బహుశా తెల్లడాక్టర్ అయితే కొంత మెరుగు. కాని ఏదో ఒక డాక్టర్ - అసలు ఇక్కడికి వస్తే-వాళ్ళు చప్పుడు చేయకుండా ఊరుకుంటే మంచిదా? ఈ పరాయి దేశంలో ఎవరు పట్టించుకునేవాళ్ళు?... ఏమైండీ, నాకు భయంగా ఉంది. పిల్లవంటిమీద చెయ్యిపెడితే సలసల కాగిపోతోంది.

ఇహ మాకు డాక్టర్‌తో పనిలేదు. తెల్లడాక్టరూ వద్దు, నల్లడాక్టరూ వద్దు. ఏ డాక్టరూ నాబిడ్డను కాపాడ లేడు. అయ్యో, నా చిట్టితల్లీ! నా బంగారుకొండా! ఎన్నెన్నో కాంక్షలూరి నా కడుపు పండిందమ్మా. పది నెలలుమోసి నిన్ను కన్నానమ్మా. ముద్దులు మూటకట్టే నీ చెక్కిళ్ళు, నీ చిట్టిపొట్టి వేళ్ళు, నన్ను గట్టిగా కరుచుకుని పాలుకుడిచే చిన్నారినోరు; తల్లీ! తలుచుకుంటే కడుపు చెరువై పోతున్నదమ్మా. అవును. స్త్రీల స్వభావమే అంత. స్త్రీల బ్రతుకే అంత. స్త్రీలకు కడుపుశోకం దుర్భరం - బిడ్డలను

పదినెలలు మోసి, కని, పెంచి, కళ్ళల్లో పెట్టుకొని కాపాడి—చివరకు కాటికి అప్పగించబడమే నమ్మాస్త్రీల బ్రతుకు!

తెల్లవాళ్ళు పాంటీకాన్‌కు వచ్చి చూస్తారు. మా ఫొటోగ్రాఫులు తీస్తారు. ఆ పెద్ద పెద్ద బొమ్మలన్నీ పత్రికల్లో అచ్చువేస్తారు. వింతగా వచ్చి చూస్తారు. కాని వాళ్ళు ఏం చేస్తారు? మేము ఒకళ్ళమా, ఇద్దరమా? లెక్కలేనంత మందిమి. నిరుపేదలం, నిర్భాగ్యులం వర్షంలో చేసే దేమిటి? చలిలో చేసేదేమిటి? మనుష్యులు వస్తారు, మరలు వస్తాయి. ఏదో తాత్కాలికంగా మాకు ఇల్లు వాలకంగా ఏర్పాటుచేయడానికి పూనుకుంటారు. మాలో దుబులా తెలివైనవాడు. అతను ఏం చెపితే వాళ్ళు అది చేస్తారు. మా కోసం వాళ్ళలా ఇళ్ళుకట్టడం మొదలు పెడతారో లేదో—అంతలోనే ఏదో మంచుకుపోయినట్టు ష్కిన్‌విలి నుంచి, అలె గ్జాండ్రానుంచి, సోఫియాఖాన్‌నుంచి, తక్కిన పల్లవాళ్ళు కూడా గుంపులు గుంపులు వచ్చి ఇక్కడ పడతారు. మళ్ళీ వాళ్ళుకూడా గోనెలతో, కొయ్యలతో, రేకులతో, గడ్డితో ఇళ్లు కట్టుకుంటారు. మళ్ళీ తెల్లవాళ్ళువచ్చి చూస్తారు. కాని ఈ మాటు జాలితో కాదు, కోపంగా వస్తారు. పోలీసులను పెట్టి ఆ జనాన్ని అక్కడనుంచి వెళ్ళగొడ్తారు. అలా వెళ్ళగొట్టబడిన జనంలో కొందరు ఆర్లాండ్‌నుంచి వచ్చిన వాళ్ళు. పాపం, మళ్ళీ వాళ్ళు తాము అక్కడ వదిలివచ్చిన ఇళ్ళకుపోతారు. కాని అప్పటికే వాళ్ళగదులు కొన్ని మరెవరో ఆక్రమించుకుంటారు. ఇహ వాళ్ళకు ఇళ్ళు లేవు. నిలుచోవడానికి నీడ ఉండదు. ఇదీ వరస.

షాంటీ టౌన్‌లో ఉంటున్నామని మీరు సిగ్గుపడ
వలసిన పనిలేదు. నా భర్త నా ఇంటిముందు నిలుచుని ఉన్నట్టు
బొమ్మతీసి, పత్రికల్లో అచ్చువేశారు. ఇదిగో, ఇప్పుడే
మరొకతను దుకాణ్‌నుంచి పత్రిక పట్టుకొచ్చాడు. ఇదిగో!
ఇందులో నా భర్త బొమ్మకూడా ఉంది. ఇంటిముందు
నిలుచుని ఉన్నాడు. మీరు ఉండేదెక్కడని ఎవరైనా
అడిగితే షాంటీ టౌన్‌లో అని చెప్పవచ్చును. మీ విలాసం
షాంటీటౌన్ అని ఉత్తరాల్లో వ్రాసుకోవచ్చును. షాంటీటౌన్
ఎక్కడున్నదో అందరికీ తెలుసును. కమిటీవాళ్ళు మీకిచ్చిన
ఇంటినెంబరు మీరు ఉత్తరాల్లో వ్రాసుకోవచ్చును, మీ
వాళ్ళకెవరికైనా చెప్పుకోవచ్చును.

కాని వర్షం వచ్చినప్పుడు మేం ఏం చెయ్యాలి!
చలికాలంలో ఏం చెయ్యాలి! ఆ కొండమీద ఇళ్ళు కడు
తున్నారని అప్పుడే కొందరు చెపుతున్నారు. వ్రేళ్లుపెట్టి
చూపిస్తున్నారు. అవింకా పూర్తికాలేదు. కాని పైన ఏదో
కప్పువేశారు. ఏదో ఒక రాత్రి మేం ఆ కొండమీదికి తర్లి
పోతాం. వర్షానికీ, చలికీ తలదాచుకుంటాం.

## ౧౦

సిమాంగువచ్చి కుమాలోను షాంటీటౌన్‌కు తీసుకవెడతా
నన్నాడు. అతను వచ్చేలోపున కుమాలో తన చెల్లెలు
గెర్ట్రూడ్‌తోను, ఆవిడ కొడుకుతోను కాలక్షేపం చేస్తూ
కూచున్నాడు. కాని చెల్లెలికంటె ఆ పసిపిల్లవాడే అతనికి

ఎక్కువ సరదా కలిగిస్తున్నాడు. నిజానికి చెల్లెలితో అతనికంత చనువు లేదు. ఆవిడ పుట్టేటప్పటికి అతను ఇరవై ఏండ్లవాడు. వయస్సులో వారిరువురికి ఇంత తేడా ఉండటంచేత బాల్యంలో ఒకరితో ఒకరికి అంతగా చనువు ఏర్పడ లేదు. పైగా అతను మితభాషిగా ఉంటున్నాడు. గంభీరంగాను, మందకొడి గాను ఉండే మనిషి. అతని తల తెల్లగా - ముగ్గుబుట్టలా నెరిసిపోయింది. కాని ఆవిడమాత్రం యౌవనంలోనే ఉంది. అంతేకాక ఆవిడతో ముచ్చటించడానికి వేరే విషయాలు ఏమున్నాయికనుక ? ఇన్నాళ్ళూ ఆవిడ జోహానసుబర్గులో గడిపిన జీవితాన్ని గురించిగాని, ఆవిడ పరిస్థితులను గురించి కాని మాట్లాడాలని అతనికెలా అనిపిస్తుంది ? ఆ విషయా లిదివరకే అతన్ని కలవరపెట్టి విచారంలో ముంచెత్తాయి.

నిజానికిప్పుడు ఆవిడస్థితి తెలుసుకుంటే ఆవిడ జీవితాని కివన్నీ ఎంతో పెద్దవిషయాలనే చెప్పాలి. పల్లెటూరి బడిలో అయిదవ తరగతికి మించని చదువు ఆవిడది. ఆవిడ పెద్దన్నగారైన అతను మితభాషి. వీటికి తగ్గట్లు సాధారణమైన స్త్రీలాగే ఆవిడ ఉంటున్నది. అన్నగారంటే ఆవిడకెంతో గౌరవమున్నది. ఏదో లోకాచారప్రకారం అన్నాచెల్లెలు సర్వసాధారణమైనవిషయాలనుగురించి ముచ్చటించుకున్నారు. కాని మళ్ళీ వారిరువురు ఆవిడ అక్కడ గడిపిన జీవితాన్ని గురించికాని, ఆవిడ అలా క్రిందపడి దుఃఖించిన విషయంకాని ఎత్తుకోలేదు.

అయినా మిసెస్ డితెబే అక్కడున్నది. ఆవిడ చాలా మంచిమనిషి. ఆవిడ, గెర్ట్రూడ్ ఎంతోసేపు

మాట్లాడుకున్నారు. కేవలం ఆడవారికి సహజంగా ప్రీతి గొలిపే విషయాలను గురించే ముచ్చటించుకున్నారు. ఇరువురూ కలిసి ఇంటిపనులు చేసుకుంటూ, ఏవో పాటా పద్యం పాడుకుంటూ హాయిగా ఉంటూ వచ్చారు.

అవును. గంభీరంగా ఉండే ఆ పసిపిల్లవాడు కుమాలోకు ఎంతో సంతోషం కలిగించాడు. అతనా పిల్లవాడికి చాకరకం కొయ్యబొమ్మలు కొన్ని కొనుక్కొచ్చి ఇచ్చాడు. ఇహనేం? వాటితో ఆ పసివాడు ప్రొద్దస్తమానం ఆడుకోవడం మొదలుపెట్టాడు. ఒకటే ఆట. వాడి ఆటేమో, వాడేమో రెండో జోలిలేదు. కుమాలో ఆ పసివాణ్ణి ఎత్తుకునేవాడు. వాడి చొక్కాక్రిందికి చెయ్యి పోనిచ్చి వళ్ళంతా తడిమేవాడు. గిల్లుతూ గిచ్చుతూ చక్కిలిగింతలు పెట్టేవాడు. అంత గంభీరంగా మూతి బిగించుకుని ఉండే పిల్లవాడుకూడా చివరకు చిరునవ్వులు మెరిపించేవాడు. ఆ చిరునవ్వులు అంతకంతకూ పెద్దవై ఆఖరుకు ఆపడానికి వీల్లేనంతగా కిలకిలమని నవ్వేవాడు. అలా ఆ పసివాణ్ణి ఆడించడంలో కుమాలోకు ఏదో వెచ్చని పచ్చని ఆనందం కలిగేది. ఒకమాటు వాడికి కథలు చెప్పేవాడు. తను పుట్టిన ఆ పెద్దలోయ, అక్కడ ఉండే కొండలపేర్లు, నదులపేర్లు, వాడు చదువుకోబోయే వీధిబడి, ఇన్‌డాట్ పేసీలో పైన - ఇళ్ళపైన దట్టంగా కమ్ముకునే పొగమంచు; వీటన్నిటినీ గురించి ముచ్చట్లు చెప్పేవాడు. కాని ఇందులో ఒక్కటికూడా ఆ పసివాడికి అర్థమయ్యేదికాదు. అయినా వాడు ఏదో అర్థంచేసుకునేవాడు. మామయ్య చెప్పే ఆ మాటలన్నీ, ఎంతో మధుర

మైన ఆ పేర్లన్నీ గంభీరంగా, శ్రద్ధగా చెవులు నొక్కి పెట్టుకు
కని వినేవాడు. గంభీరమైన ఇంతింత కళ్ళు పెట్టుకుని
మామయ్యవంక తదేకంగా చూచేవాడు. ఇంటిపై బెంగ
పెట్టుకుని ఆ మహానగరంలో ఉంటున్న కామాలోకు నిజంగా
ఇదిఎంతో హాయినీ ఆనందాన్ని చేకూర్చేది. ఈ విషయా
లన్నీ ఆ పసివాడితో చెప్పుకోనుకున్నప్పుడు అతని అంత
రంగంలో ఏదో హాయి. సంతృప్తి కలిగేవి. మామా
అల్లుళ్ళు ఇలా ముచ్చట్లలో మునిగిఉంటే అప్పుడప్పుడు గెర్
ట్రూడ్ వచ్చి చూచేది. బిడియపడుతూ తలుపుచాటున
నిలుచుని అంతా వినేది. తన జన్మభూమిని గురించిన సుంద
రమైన కథలు వింటుంటే ఆవిడ కళ్ళు చెమ్మగిలేవి. ఇది
అతన్ని ఇంకా ఆనందంలో ముంచివేసేది. ముచ్చటచెపుతూ
మధ్యమధ్య చెల్లెల్ని "నీకిది జ్ఞాపకమున్నదా అమ్మాయీ?"
అని అడిగేవాడు. ఆవిడ "అవునన్నయ్యా జ్ఞాపకమున్నది"
అని సమాధానం చెప్పేది. అప్పుడతను మరింత పొంగిపోయే
వాడు.

కాని ఇలా సంతృప్తిలో ఉండగా అప్పుడప్పుడు అత
నికి జ్ఞాపకాలొచ్చేవి. తన కుమారుడు జ్ఞాపకం వచ్చేవాడు.
దాంతో ఒక్కక్షణంపాటు తన దేశం జ్ఞాపకం వచ్చేది.
ఎండకు ఎండి వానకు తడిసి, దిక్కూ మొక్కూ లేక నిర్జ
నంగా పడిఉన్న ఆ కొండలు, గలగలమని ప్రవహించడం
మానుకున్న ఆ నదులు, సెలయేళ్ళు, పోషణచేసే నాథుడు
లేక బక్కచిక్కిపోయి ఎర్రటి చవిటి పర్రలలోను, గడ్డిపర
కయినా కనిపించని బీడు భూములలోను దిక్కులేక తిరుగు

తున్న ఆ పసుపువ్వుల మందలు; అవన్నీ కళ్ళముందు పొడ
గట్టేవి. ఇప్పుడా దేశం కేవలం వృద్ధులైన స్త్రీలకు, తల్లు
లకు, పసిపిల్లలకు మాత్రమే నివాసం కావడం, అక్కడున్న
ప్రతి ఇల్లూ ఏదో విధంగా విచ్ఛిన్నమైపోవడం; ఇవన్నీ అతని
స్మృతిపథంలోకి వచ్చేవి. వెంటనే అతనిమాటలు తడబడేవి.
కంఠస్వరం సన్నగిలిపోయి మాట్లాడలేకపోయేవాడు. మౌనం
వహించి ఏదో అంతులేని పరధ్యానంలో పడిపోయేవాడు.
చేతుల్లో ఉన్న ఆ పసివాడు కదలడం వల్లనో, లేక వింటూ
కూచున్న ఆ పసివాణ్ణి తను హఠాత్తుగా పట్టుకోవడంవల్లనో
అతనికా మైకంలోనుంచి తెలివివచ్చేది. వెంటనే పిల్లవాణ్ణి
క్రిందదించేవాడు. వాణ్ణి మళ్ళీ ఆ కొయ్యబొమ్మలతో ఆడు
కోనిచ్చేవాడు. ఎవరికీ అవగతంకాని తన బాధనుంచి బయట
పడేమార్గంకోసం, ఎలాగో ఒక లాభాన్ని మరిచిపోవడం
కోసం, వెదుకులాడేవాడు. కాని మళ్ళీ అంతలోనే తన
భార్య విషయం తలపుకు వచ్చేది. తన స్నేహితు లనేకమంది
జ్ఞాపకం వచ్చేవారు. కొండలుదిగి బడికిపోతున్న చిన్న చిన్న
పిల్లలు అప్పుడప్పుడు ఆ పొగమంచులో చిక్కుకుని క్రింద
పడిపోవడం మనస్సులోకి వచ్చేది. ఇవన్నీ అతనికెంతో
ప్రియతమమైన విషయాలు. చిత్తమంతా వీటిమీద లగ్నం
చేసి అలా నిశ్శబ్దంగా కూర్చుండిపోయేవాడు. అతనిబాధ
ఉపశమించేది. అతనికేదో కొంతశాంతి లభించేది. కొండల,
నదుల, పేర్లలోనే ఎంత మాధుర్యమున్నది!

నిజానికి ఈ అనంత ప్రపంచయాత్ర మర్మమేమిటో
ఎవరికి తెలుసు? పాడుపడిన ప్రపంచంలోనే ప్రశాంతి

ఎందుకున్నదో ఎవరికి తెలుసు? ఇంతటి దైన్యావస్థలో క్రుంగిపోతూకూడా అత నా పసికూనతో ఆడుకో కలుగుతున్నాడు. అతని పంచప్రాణాలు ఆ పసికూన వ్యాకుల పీడితుడై ఉన్న ఆ వృద్ధుడికి ఆ పసివాడు వెలుగులా కనిపించాడు. ఇందుకే భగవంతుడికి చేతులెత్తి నమస్కరించాలి.

నిజానికి ఈ అనంత ప్రపంచయాత్ర మర్మమేమిటో ఎవరికి తెలుసు? మనం దేనికోసం జీవిస్తున్నామో, ప్రయాస పడుతున్నామో, తుదకు మరణిస్తున్నామో ఎవరికి తెలుసు? మనకు అన్నివిషయాలూ దూరమై, అన్నివిధాలా విచ్ఛిన్నమై, పోయినప్పటికీ మనలను జీవించేటట్లు, ప్రయాస పడేటట్లు తుదకు మరణించేటట్లు చేస్తున్నదేమిటో ఎవరికి తెలుసును? కన్నకొడుకును కోల్పోయి మళ్ళీ పొందలేని ఒకానొకవ్యక్తి సహితం ఒక పసివాడి పరిరంభణంలో ప్రశాంతిని, సుఖాన్ని ఎందుకు పొందగలుగుతున్నాడో ఎవరికి తెలుసును? వివేకవంతులు అర్థంకూడా కాని కఠిన పదాలతో అనేక గ్రంధాలు రచిస్తారు, కాని మన జీవితాలకు పరమావధి ఏమిటో, మనం పడే అన్ని ప్రయాసలకు పరిసమాప్తి ఏమిటో—ఈ ఒక్క విషయం ఏ మానవ వివేకానికి కూడా అందని విషయం. ఓ ఈశ్వరా! ఓ ప్రభూ! నన్ను ఎన్నటికీ పరిత్యజించకు. అవును. నేను మృత్యుగహ్వరంలో చొరబడి ప్రయాణం చేస్తున్నప్పటికీ నీవు నాతో ఉంటే నాకెలాంటి భయంలేదు ప్రభూ! ఏ ప్రమాదం నన్ను తాకలేదు ప్రభూ!...

కుమాలో లేచి నిలుచున్నాడు. సిమాంగు వచ్చి వాకిలిదగ్గర మాట్లాడుతున్నాడు. ఇహ ఇప్పుడు తిరిగి కొడుకును వెదకడంకోసం బయలుదేరాలి.

*　　　　*　　　　*

"షాంటీటౌన్ అంటే ఇదే నాయనా."

ఇక్కడ మనుష్యులు నివసించే ఇళ్లు ఇళ్లుకావు. హృదయ విదారకంగా ఉన్నాయి. మధ్య మధ్య ఇరుకు సందులు, గొందులు. కాని ఆ ఇరుకుసందుల్లోనే పిల్లలు కిలకిల నవ్వుకుంటూ ఆడుకుంటున్నారు. ఒక ఇనుపరేకు, కొద్దిగా బల్లచెక్కలు, గోనెపట్టాలు, గడ్డి, ఏదో పాడుపడిన ఇంటితాలూకు పాత తలుపు ఒకటి; ఇదీ ఇంటితీరు. కృత్రిమంగా ఏర్పాటుచేసిన ఇంటి కన్నాల్లోనుంచి, గవాక్షల్లో నుంచి పొగ చుట్టలు చుట్టలుగా లేచి పైకి వస్తోంది. వంట కాల వాసన గుప్పున కొడుతోంది. మాటలు వినవస్తున్నాయి. బాధతోకాని కోపంతోకాని మాట్లాడుకుంటున్న మాటలు కావవి. మామూలు విషయాలను గురించి సంభాషణ. ఎవరో ఒకబిడ్డ పుట్టింది. ఎవరో ఒకబిడ్డ చచ్చింది. ఆ పిల్లవాడు బడిలో బాగా, ఉన్నాడు. ఆ మనిషి ఇప్పుడు జైల్లో ఉన్నాడు. — ఇవీ మాటలు. అక్కడ క్షామం ఉన్నది—చినుకన్నమాట లేదు. మబ్బు, మసక లేదు— ఫెళ ఫెళ ఎండకాస్తోంది. కాని వర్షంవస్తే వాళ్లుఏంచేస్తారు? శీతగాలి వీస్తే వాళ్లు ఏంచేస్తారు ?

"ఈ దృశ్యాలను నేను చూడలేకుండా ఉన్నాను—
నా హృదయం విచారంతో క్రుంగిపోతోంది."

"కాని అక్కడ ఇళ్లు కడుతున్నారు చూడు. అనేక సంవత్సరాలకు ఇటువంటిపని జరుగుతున్నది. దీనివల్ల ఏదో కొంత మంచి రావచ్చు. ఈ పనికూడా చురుకుగా చేసిందే."

"చూడబోతే అతను అంతేగా ఉన్నట్లుంది!"

"చూడండి, మన జాతికి చెందిన నర్సు ఒకావిడ అక్కడ ఉన్నది. ఆ ఎరుపు తెలుపు వర్ణంలో, తలకు టోపీ పెట్టుకుని ఆవిడ ముచ్చటగా కనిపించటంలేదూ?"

"అవును, చక్కగా ఉంది."

"తెల్లవాళ్లు వారికి శిక్షణ ఇస్తున్నారు. రోజు రోజుకూ ఎక్కువమందిని తయారుచేస్తున్నారు. చిత్రమేమంటే కొన్ని విషయాల్లో మనం ముందుకు పోతున్నాం. మరికొన్ని విషయాల్లో ఉన్నచోటనే ఉన్నాం. ఇంకా కొన్ని విషయాల్లో అయితే వెనక్కుపోతున్నాం. ఈ నర్సుల శిక్షణ విషయంలో మాత్రం తెల్లవాళ్ళలో మన కెంతో మంది స్నేహితు లేర్పడ్డారు. విట్ వాటర్స్‌రాండ్‌లోని యూనియన్ విశ్వవిద్యాలయంలో మన యువకులలో కొందరిని డాక్టర్లుగా చేర్చుకుని శిక్షణ ఇవ్వాలని నిర్ణయించినప్పుడు, జరిగిన గోల ఇంతా అంతా కాదు. కాని మన తెల్ల స్నేహితులు అందు కేమాత్రం తొణకకుండా ఉన్నారు. మనకొక స్వంత ప్రదేశమంటూ ఏర్పడినదాకా వాళ్ళకు అక్కడే శిక్షణ ఇస్తారు... ...గుడ్ మార్నింగ్ నర్స్."

"గుడ్ మార్నింగ్ ఉమెన్సన్ డీన్."

"నమస్తే! ఇక్కడ మీరు చాలా కాలంబట్టీ పని చేస్తున్నారా?"

"అవును. ఈ ప్రాంతం ఏర్పడినప్పటినుంచి నేనిక్కడే పనిచేస్తున్నాను."

"అయితే మీకెప్పుడైనా అబ్ సాలమ్ కుమాలో అనే కుర్రవాణ్ణిగురించి తెలిసిందా?"

"ఆ, తెలుసును. కాని అతనిప్పుడు ఇక్కడ లేడు. అయినా ఎక్కడున్నాడో చెప్పగలను. అతను హ్లాట్ షవాయ్‌ల కుటుంబంతో ఉంటున్నాడు. వారింకా ఇక్కడే ఉన్నారు. చూడండి! అక్కడ ఇళ్లు అవీ లేకుండా రాళ్ళతో నిండిన ప్రదేశం ఒకటి కనిపించటం లేదూ? అక్కడొక చిన్న కుర్రవాడు నిలబడి ఉన్నాడు చూడండి."

"అవును, కనిపిస్తోంది."

"దాని అవతల ఒక గొట్టంతో ఉన్న ఇల్లు — అదిగో, పొగ బయటికొస్తోంది. కనిపించటం లేదూ?"

"అవును; కనిపిస్తోంది."

"మీరు ఆ సందు దిగువకు వెళ్ళండి. కుడిచేతివైపు మూడో ఇల్లో, నాలుగో ఇల్లో హ్లాట్ షవాయ్‌లది.

"మీకెంతో కృతజ్ఞులమమ్మా. వెళ్ళొస్తాం."

ఆవిడ చెప్పిన గుర్తులనుబట్టి వారా ఇల్లు ఏమాత్రం శ్రమలేకుండానే కనుక్కోగలిగారు.

"నమస్కారమమ్మా."

ఆ స్త్రీ ఎంతో పరిశుభ్రంగాను, చక్కగాను కని పిస్తోంది. వారినిచూచి చిరునవ్వుతో, స్నేహ పూర్వకంగా బదులుచెప్పింది.

"నమస్కారం ఉమ్సున్‌డీస్."

"అమ్మా, మేం అబ్‌సాలమ్ కుమాలో అనే అబ్బాయికోసం వచ్చాం."

"ఆ అబ్బాయి నాదగ్గరే ఉంటున్నాడు ఉమ్సున్ డీస్. పాపం అతనికి వేరేచోటు లేదు వెళ్ళడానికి. అంచాత అతనంటే మాకెంతో జాలివేసింది. కాని ఒకవిషయం మీతో చెప్పవలసివచ్చినందుకు విచారిస్తున్నాను. ఆ అబ్బా యిని వాళ్ళు పట్టుకపోయారు. మేజిస్ట్రేటు ఆ పిల్లవాణ్ని 'పిల్లల జైలు' (Reformatory) కు పంపించాడని విన్నాను."

"పిల్లల జైలా?"

"అవును. అక్కడొక పెద్ద పాఠశాల ఉంది. సైనికుల ఆస్పత్రి అవతల. ఇక్కడికి ఆట్టేదూరం లేదు. నడిచి వెళ్ళ వచ్చును."

"చాలా కృతజ్ఞుణ్ణి అమ్మా. నమస్కారం. వెళ్ళొ స్తాను. రా నాయనా మనం వెడదాం."

వారిరువురూ మౌనంగా నడకసాగించారు. ఎవరినోటా మాటరాలేదు. రోడ్డుఎక్కడా మిట్టపల్లాలు లేక, తిన్నగా, నడవడానికి ఎంతో అనుకూలంగా ఉంది. అయినా కుమాలో తూలిపడబోయాడు. సిమాంగు అతనిరెక్క పుచ్చుకున్నాడు.

"ధైర్యంగా ఉండు నాయనా" అన్నాడు.

ఇలా అని స్నేహితుడిపంక చూచాడు. కాని సుమాలో కళ్ళు దించుకుని నేలమీదికి చూస్తున్నాడు. అతనిముఖం సిమాంగుకు కనిపించలేదు. కాని అతని కళ్ళవెంట రెండు కన్నీటిబొట్లు రాలి క్రిందపడడం చూచాడు; అతనిరెక్క మరింత గట్టిగా పట్టుకుని ఊతం ఇచ్చాడు.

"గుండెచెడకు. ధైర్యంగాఉండు నాయనా" అన్నాడు.

"ఇంకెక్కడి ధైర్యం—ఇహ నాలో ధైర్యమనేది లేదనిపిస్తోంది ఒక్కొక్కప్పుడు."

"ఈ 'పిల్లల జైలు'ను గురించి నేను విన్నాను. ఇంగ్లండునుంచి వచ్చిన మతగురు వున్నాడే— నీ స్నేహితుడు, ఆయన దీని విషయం బాగా చెపుతాడు. ఏ పిల్లవాడైనా తన నడవడి సరిదిద్దుకుంటానని కోరినట్లయితే వారతనికి సహాయం చేస్తారని ఆయన చెప్పగా విన్నాను. అంచాత అధైర్యపడకండి."

"ఈ విషయంలో నాకు భయంగా ఉంది."

"అవును. నాకూ భయంగానే ఉంది."

"అవును. తొలిసారి మీకెప్పుడు భయం ఆవహించిందో నాకు జ్ఞాపకమున్నది. ఆనాడు అలెగ్జాండ్రాకు వెళ్ళినప్పుడు మీరు నన్ను అవతలికి పంపించి మళ్ళీ ఆ స్త్రీతో మాట్లాడడానికి వెళ్ళారు. తిరిగి వచ్చేటప్పటికి భయ కంపితులై ఉన్నారు. మీకు భయం కలగడం అదే మొదలు."

"మీరు గమనించారే! మీకు పట్టుపడకుండా ఉండ లేనన్నమాట!"

"నేనంత మహా తెలివికలవాణ్ణేమీకాదు. నా కుమా రుని విషయం కాబట్టి ప్రతిదీ గమనిస్తున్నాను."

నా రికుప్రుటు పాంటికెటాన్ దాటి అట్లాంటాలోకి వచ్చాక. తాను రోడ్డుమీద నడవసాగారు. ఆ రోడ్డు జోహానసుబర్గుకు వెళ్ళే హైరోడ్డుకు త్రోవ తీస్తుంది. వారు అట్లాంటా ముఖద్వారమందున్న ఒక పెద్ద పెట్రోలుస్టేషన్ దగ్గిరికి చేసుకున్నారు. ఆ పెట్రోలుస్టేషన్ తెల్లవారిది. అట్లాంటాలో నల్లజాతివారికి పెట్రోలు స్టేషన్‌లు పెట్టుకునేందుకు అనుమతి లేదు.

"ఆ స్త్రీ మీతో ఏమని చెప్పింది నాయనా?"

"ఈ కుర్రవాళ్ళిద్దరూ ఏవో చేస్తూ వచ్చారని చెప్పింది. అనేక వస్తువులు.... తెల్లవాళ్ళకు చెందిన వస్తువులు ఇంటికి తెస్తుండేవారని చెప్పింది."

"మరి ఈ 'పిల్లల జైలు' విషయం ఏమిటి? అక్కడ వీరికి నీతి గఱపి మంచి మార్గంలో పెడతారా?"

"ఆ విషయం నాకు అంతగా తెలీదు. కొందరు ఒక విధంగాను, మరికొందరు మరోవిధంగాను చెపుతారు. కాని మీ స్నేహితుడున్నాడే — ఆయన దీనివిషయం ఎంతో చక్కగా చెపుతాడు."

చాలాసేపు సిఖూంగు ఆలోచనలు మారి వేరే విషయాలవైపు మళ్ళాయి. అప్పుడు కుమాలో మళ్ళీ ఇలా అన్నాడు:

"ఆ జైల్లో ఈ కుర్రవాళ్ళను బాగు చేస్తారనే నాకు అనిపిస్తోంది."

దాదాపు ఒక గంటసేపు నడిచిన తరువాత వారు 'పిల్లలజైలు'కు వెళ్ళే రోడ్డుమీదికి వచ్చారు. అప్పటికి మిట్టమధ్యాహ్నం అయింది. అన్నివైపులనుంచీ పిల్లవాళ్ళు బారులుతీరి 'మార్చింగ్' చేసుకుంటూ జైలుగేట్లదగ్గరికి వెడుతున్నారు. ప్రతిచోటునుంచీ వస్తున్నారు వాళ్ళు. వాళ్ళ బారుకు అంతంటూ కనిపించడంలేదు.

"ఇక్కడ ఎంతోమంది ఉన్నారు నాయనా."

"అవును. ఇంతమంది ఉంటారని నాకు కూడా తెలీదు."

తమ జాతికి చెందిన ఒకతను వారి దగ్గరికి వచ్చాడు. మనిషి చాలా ఉల్లాసంగా ఉన్నాడు. ముఖంలో చిరునవ్వు చిందుతోంది. వారిని పలకరించి 'వచ్చిన పనేమిటి' అని అడిగాడు. అబ్‌సాలమ్ కుమాలో అనే కుర్రవాడికోసం వెదుకుతున్నామని వారు సమాధానం చెప్పారు. ఇంకేం! వెంటనే అతను వారినొక ఆఫీసు దగ్గరికి తీసుకెళ్ళాడు. అక్కడ తెల్లజాతికి చెందిన ఒక యువకుడున్నాడు. అతను ఆఫ్రికాన్స్ భాషలో * వచ్చిన పనేమిటని వారిని అడిగాడు.

* దక్షిణాఫ్రికాలోని డచ్చివారు మాట్లాడే భాష.

"అయ్యా; నా స్నేహితుని కుమారుడి కోసమని వచ్చాం. ఆ అబ్బాయి పేరు అబ్ సాలమ్ కుమాలో" అని అదే భాషలో సమాధానం చెప్పాడు సిమాంగు

"అబ్ సాలమ్ కుమాలో. అవును. అతన్ని నే నెరుగుదును. కాని ఎంత చిత్రం! తన కెవరూ లేరని చెప్పాడు ఆ అబ్బాయి."

"నాయనా మీ కుమారుడు ఆయనతో తన కెవరూ లేరని చెప్పాట్ట" అని సిమాంగు జూలూ భాషలో కుమాలోతో అన్నాడు.

"అవును. వాడు సిగ్గుపడి ఉంటాడు" అన్నాడు కుమాలో: "క్షమించండి నేను ఆఫ్రికాన్సు భాష మాట్లాడలేను" అని జూలూ భాషలో సిమాంగుతో అన్నాడు. ఆఫ్రికాన్సుభాష రాని నల్లవాళ్ళంటే వాళ్ళకు అప్పుడప్పుడు గిట్టదని చెప్పగా విని ఉన్నాడు కుమాలో. అంచాతనే ఇలా అన్నాడు.

"మీ కిష్టమైన భాషలో మాట్లాడవచ్చును. మరేం ఇబ్బంది లేదు. మీ కుమారు డిక్కడ ఎంతో ముచ్చటగా ఉన్నాడు. మా జైలులో వచ్చిన పిల్లవాళ్ళలో అతనూ ఒకడు. అతనికి మంచి భవిష్యత్తు ఉన్నదని నేనెంతో ఆశ పెట్టుకున్నాను" అన్నాడా యువకుడు.

"అంటే అయ్యా, ఆ అబ్బాయి ఇక్కడినుంచి వెళ్ళిపోయాడంటారా?"

"అవును వెళ్ళిపోయాడు. ఒక్క నెల క్రితమే ఈ అబ్బాయి విషయంలో మేం కొంత ప్రత్యేకత చూపించి విడిచిపెట్టాం. అతని యొక్క సత్ప్రవర్తన వల్లను, అతని వయస్సును బట్టిన్నీ, అన్నిటికంటె ముఖ్యంగా అతనొక అమ్మాయితో సంబంధం పెట్టుకోవడం, ఆ పిల్ల గర్భవతి కావడం వల్ల మేం ఇలా చేశాం. ఆ అమ్మాయి అతన్ని చూడటానికి ఇక్కడికి వచ్చింది. అతనా పిల్లను ఎంతగానో ప్రేమిస్తున్నట్లు కనిపించాడు. పుట్టబోయే బిడ్డను గురించి ఎంతో ఆందోళన పడుతున్నట్లుకూడా కనిపించాడు. ఆ అమ్మాయి కూడా అతనంటే ఎంతో మక్కువ పడుతున్నట్లు కనిపించింది. కనుక ఈ విషయాలన్నీ ఆలోచించి ఆ అబ్బాయి తన బిడ్డకోసం, బిడ్డ తల్లికోసం పాటుపడేలాగా అతని దగ్గర నుంచి మాట తీసుకొని, మంత్రిగారితో చెప్పి అతన్ని వదిలి పెట్టించాం. నిజానికి ఇలాంటి విషయాల్లో ఎక్కువ భాగం సత్ఫలితాలు లేకుండానే పోతుంటాయి. కాని ఆ పిల్ల, పిల్ల వాడు కూడా నిజమైన పరస్పరానురాగం కలిగి ఉన్నట్లు కని పిస్తే దాన్ని మేం అవకాశంగా తీసుకుని, తప్పక మంచి జరుగుతుందని ఆశించి ఇలా చేస్తుంటాం. ఒక్క విషయం మాత్రం నిశ్చయం. ఇది కనుక విఫలమైనట్లయితే ఇహ ఏదీ కూడా విజయం పొందలేదన్నమాట"

"అయితే అయ్యా, ఇప్పుడా అబ్బాయి పెళ్ళిచేసు కున్నాడా ?"

"లేదు ఉమ్‌ఫున్ డీన్. చేసుకోలేదు. కాని వివాహానికి అన్ని ఏర్పాట్లు జరిగాయి. ఈ అమ్మాయికి తనవాళ్ళెవరూ

లేదు. పోతే మీ అబ్బాయికూడా తన కెవరూ లేరని చెప్పాడు. అంచాత నేనే స్వయంగా ఈ దేశీయుడైన నా అసిస్టెంటు సహాయంతో ఈ ఏర్పాటు చేశాను."

"అయ్యా మీరు చాలా ఉదారస్వభావులు. మీకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను."

"ఇది మా విధి. దీన్ని గురించి మీరంతగా ఆందోళన పడకండి. వాస్తవానికి వారికింకా వివాహం కాలేదు. ఇప్పుడున్న అసలు ప్రశ్న ఏమిటంటే, ఆ అబ్బాయి ఆ తల్లినీ పిల్లను జాగ్రత్తగా పోషించి మర్యాదగా జీవిస్తాడా అని" అన్నాడా యువకుడు దయతో.

"నిజానికిది నన్ను కలవరపెట్టే విషయమైనప్పటికీ దాని స్వభావాన్ని గుర్తించాను."

"అవును నా కర్థమైంది. ఈ విషయంలో ఇప్పుడు మీకు నేను సహాయం చేస్తాను. మీరు కొంచెంసేపు అవతల కూచున్నట్లయితే నేను నా చేతిలోపని పూర్తి చేసుకుని వస్తాను. అబ్సాలమ్, ఆ అమ్మాయి నివసించే ఫిమ్విలీకి మిమ్మల్ని తీసుక వెడతాను. అతనక్కడ ఉండడు. అతనికి నేను నగరంలో పని చూసిపెట్టాను. అతను పని బాగానే చేసుకుపోతున్నాడని నాకు వాళ్లు చెప్పారుకూడా. కొంత డబ్బు మిగుల్చుకో వలసిందని నే నతన్ని తొందరపెట్టాను. ఇప్పు డతను పోస్టాఫీసులో మూడు నాలుగు పౌనులు దాచుకున్నాడు."

"అయ్యా! మీ మే లెన్నటికీ మరువలేను."

"ఇది మా పద్ధతి. సరే, ఇహ మీరు వెళ్ళి అవతల కూచుంటే నా పని ముగించుకుని వస్తాను. మిమ్మల్ని ఫిమ్‌విలీ తీసుకెళతాను" అన్నాడా యువకుడు.

పిల్లల జైలు ఇవతల ఉల్లాసంగా ఉన్న ఒక వ్యక్తి వచ్చి వారిని కలుసుకున్నాడు. వారితో మాట్లాడి వారి సంగతి సందర్భాలన్నీ తెలుసుకున్నాడు. తరువాత వారిని తన ఇంటికి ఆహ్వానించి తీసువెళ్ళాడు. ఆ ఇంట్లో అతను, అతనిభార్య, అనేకమంది కుర్రవాళ్లు ఉన్నారు. జైలునుంచి వచ్చిన కుర్రవాళ్లు వాళ్లు. ఇలా అనేకమంది పిల్లలు జైలు వదిలిపెట్టి జైలు ఇవతల స్వేచ్ఛగా ఉన్న వీడి ఇళ్ళల్లో గృహస్థులను ఆశ్రయించుకుని ఉంటున్నారు. ఆ గృహస్థు వారికి కొంత ఉపాహారంపెట్టి టీ ఇచ్చాడు. అబ్‌సాలమ్ పిల్లవాళ్ళందరిలోకీ పెద్దగా ఉన్నాడనీ, జైలులో ఉన్నంత కాలం సత్ప్రవర్తనతో ఉన్నాడనీ అతను కూడా వారితో చెప్పాడు. ఇలా వారు 'పిల్లల జైలు'ను గురించి, ఇల్లు, వాకిలి, చదువు, సంధ్య లేకుండా జోహానసుబర్గులో పెరిగి పెద్దవారవుతున్న పిల్లలను గురించి, జాతి విచ్ఛిన్నమైపోవడాన్ని గురించి, నిస్సారమైపోయి అరిష్టం చుట్టుకున్న భూమిని గురించి ఎన్నెన్నో విషయాలు మాట్లాడుకున్నారు. అంతలో ఒక బంట్రోతువచ్చి ఆ తెల్ల ఉద్యోగి సిద్ధంగా ఉన్నాడని వారికి చెప్పాడు.

మోటారుకారు ఫిమ్‌విలీ చేరడానికి ఆట్టేసేపు పట్ట లేదు. ఫిమ్‌విలీ ఒక గ్రామం. పెద్ద పెద్ద నీళ్ళ తొట్లనే సగం సగం ఇళ్ళగా ఉపయోగించుకుని జనం నివసిస్తున్నారు.

ఎన్నో ఏండ్లక్రితం అత్యవసరమైన పరిస్థితుల్లో ఇలా నివాసం ఏర్పరచుకోవడం సంభవించింది. కాని వాళ్ళు అప్పటికీ ఇప్పటికీ అలాగే స్థిరపడిపోయారు. అవునుమరి, జోహానసు బర్గు వచ్చిన ప్రజలందరికీ చాలినన్ని ఇళ్ళు ఏనాడూ లేవు. వారు గ్రామం గేటుదగ్గరికి వెళ్ళి లోపలికి పోవడానికి అనుమతి తీసుకున్నారు అనుమతి లేకుండా ఈ ప్రదేశాల్లోకి తెల్లవాళ్ళెవరూ వెళ్ళడానికి వీల్లేదు.

వారొక ఇంటిముందు ఆగారు, ఆ తెల్లజాతి యువ యువకుడు వారిని ఆ ఇంట్లోకి తీసుకెళ్ళాడు. ఇంట్లోనుంచి ఒక అమ్మాయివచ్చి వారిని ఆహ్వానించింది. ఆ అమ్మాయి కేవలం ఒక శిశువులాగా, అమాయికంగా అగుపిస్తోంది.

"మేం అబ్‌సాలమ్‌ను గురించి తెలుసుకోవడానికి వచ్చాం. ఈ మతగురువు ఆ అబ్బాయి తండ్రి" అన్నాడు తెల్లజాతి యువకుడు.

"అతను శనివారంనాడు స్ప్రింగ్సుకు వెళ్ళాడు. మళ్ళీ ఇంతవరకు ఇంటికి రాలేదు." అని చెప్పింది ఆ అమ్మాయి.

యువకుడు కొంచెంసేపు మౌనం వహించాడు. కోపం వల్లనో లేక కలవరం వల్లనో కనుబొమలు ముడివెట్టాడు.

"కాని ఇవాళ మంగళవారం. ఇంతవరకూ అతనిజాడ తెలియలేదా ?" అని అడిగాడు.

"తెలియలేదు" అని చెప్పిందా అమ్మాయి.

"అయితే ఎప్పుడొస్తాడు?" అని అడిగా డతనుమళ్ళీ.

"ఏమో, నాకు తెలీదు" అన్నదావిడ.

"అయితే ఎప్పటికీ రాడా?" ఉదాసీనతతోను, నిర్లక్ష్యంగాను అడిగాడతను.

"ఏమో, నాకు తెలీదు" అని చెప్పిందావిడ. ఆవిడ కంఠస్వరంలో బలంలేదు, ఆశ లేదు. దిక్కులేని స్థితిలో వేచి ఉండడానికి అలవాటుపడిన మనిషిలా మాట్లాడింది. తనకీ భూమిమీద దెబ్బయిపండ్లు నిండినట్లు, తననుంచి ఆశించవలసింది ఏమీ లేనట్లు మాట్లాడింది. ఆవిడ ఎదురించదు, అధికారంతో అడగదు, క్రౌర్యం చూపదు. తనను ఉపయోగించుకుని, వదిలిపెట్టి, తుదకు మరిచిపోయిన పురుషులవల్ల తనకు కలిగిన సంతానాన్ని కాపాడుకుంటుంది. అయినా వారిని ఆవిడ పల్లెత్తుమాట అనదు. ఆవిడ శరీరం చిన్నది; వయస్సు చిన్నది; ఇంత పసితనంలోనా ఇన్ని బాధలు, బరువులు. ఆ పిల్ల వాలకం చూచేసరికి అంతబాధల్లో ఉన్న కుమారాలో హృదయం కరుణతో కరిగిపోయింది.

"అయితే నీవు ఏంచేస్తావమ్మా?" అని అడిగాడు.

"ఏమో, నాకు తెలీదు" అన్నదా పిల్ల.

"బహుశా నీవు మరో పురుషుణ్ణి చూచుకుంటావు కాబోలు" అన్నాడు సిమాంగు వెగటుగా, ఆ వెగటుతనం ఆ అమ్మాయికి అగుపించకుండే విధంగా. కుమారాలో ఏమైనా అనడానికి అవకాశం లేకపోయింది. ఆవిడ జవాబు చెప్పింది.

"ఏమో, నాకు తెలీదు."

మళ్ళీ కుమాలో మాట్లాడకముందే, సిమాంగు ఆ అమ్మాయికి కనిపించకుండా వెనక్కి మళ్ళి కుమాలోతో రహస్యంగా ఇలా అన్నాడు:

"ఇహ ఇక్కడ మనం చేసేదేమీ లేదు నాయనా వెళదాం పద."

"అయ్యో నాయనా......"

"అవును నా మాట వినండి మీ రిక్కడ చేసేదేమీ లేదు. ఇప్పుడు మీరనుభవిస్తున్న మీ కష్టాలు చాలవా? నా మాటవినండి. ఇలాంటివాళ్ళు జోహాన్సుబర్గులో కొన్ని వేలమంది ఉన్నారు. మీకు స్వర్గాన్ని తలదన్నే శక్తి ఉన్నప్పటికీ, మీ దగ్గర కనకపురాసు లున్నప్పటికీ, పాపులందరినీ పునీతంచేసే కరుణ మీలో ఉన్నప్పటికీ మీరు చెయ్యగలిగిందేమీ లేదు."

వారు మౌనంగా ఇవతలి కొచ్చేశారు. ముగ్గురూ మౌనంగానే ఉండిపోయారు. తెల్లజాతివాడైన ఆ యువకుడు తన ప్రయత్నం విఫలమైపోయి నందువల్ల, వృద్ధుడైన కుమాలో దుఃఖంవల్ల, సిమాంగు తనకు కలిగిన ఏవగింపు వల్ల అలాగే ఊరుకున్నారు. కుమాలో కారుదగ్గర నిలుచున్నాడు. తక్కినవారు అప్పటికే కార్లోఎక్కి కూచున్నారు.

"మీరు అర్థం చేసుకోవడంలేదు. ఆ అమ్మాయికి పుట్టబోయే బిడ్డ నాకు మనుమడు అవుతాడు" అన్నాడు కుమాలో.

"అదిమాత్రం ఏమంత నమ్మకం!" అన్నాడు సిమాంగు కోపంగా. అతని ఏవగింపు మరింత ఉధృతమైంది. "సరే. ఆ పుట్టబోయే బిడ్డ మీ మనుమడనే అనుకుందాం. కాని ఇంకా ఇలాంటి మనుమలు ఎంతమంది అవుతారో మీ కెలా తెలుస్తుంది? రోజు రోజుకూ, గంట గంటకు మనం వాళ్ళకోసం వెదకగలమా? దానికి అంతంటూ ఉంటుందా?"

కుమారాలో దెబ్బతిన్నవాడిలాగా ఆ దుమ్ములో అలాగే నిలుచుండిపోయాడు. తరువాత మారుమాట్లాడ కుండా కార్లో ఎక్కి కూచున్నాడు.

మళ్ళీ కారు గ్రామం గేటుదగ్గర ఆగింది. తెల్లజాతి యువకుడు కారు దిగి అక్కడున్న యూరోపియన్ సూపరిం టెండెంటు ఆఫీసుకు వెళ్ళాడు. మళ్ళీ తిరిగి వచ్చేసరికి అతని ముఖంలో కళ కాంతు లేవు.

"నేను ఫ్యాక్టరీకి టెలిఫోను చేశాను. నిజమే. ఆ అబ్బాయి ఈ వారమంతా పనిలో లేడు" అన్నాడు.

ఆర్లాండో గేట్లదగ్గరఉన్న పెట్రోలు స్టేషన్ ప్రక్క మళ్ళీ వాళ్లు కారు ఆపారు.

"మీ రిక్కడ దిగిపోతారా?" అన్నాడు యువకుడు.

వారు కారుదిగారు. తరువాత యువకుడు కుమారాలోతో ఇలా అన్నాడు:

"ఇలా జరిగినందుకు విచారిస్తున్నాను."

"అవును నాయనా. ఇది మోయలేని బరువు, బాధ."

ఇంగ్లీషు మరిచిపోయినట్లు జూలూ భాషలో సిమాంగుతో అన్నాడు. "అతని పని కాకపోయి నందుకు నేను కూడా విచారిస్తున్నాను" అన్నా డతను.

"మీ పని కానందుకు అతను కూడా విచారిస్తున్నాడు." అన్నాడు సిమాంగు, ఆఫ్రికాన్సు భాషలో.

"అవును. ఇది నా విధి. కాని పాపం ఆయనకు కుమారుడు" అంటూ యువకుడు కుమాలో వంక తిరిగి ఇంగ్లీషులో ఇలా అన్నాడు : "మనం ఇంతటితో ఆశ వదులుకోవలసిన పని లేదు. ఒక్కొక్కప్పుడు ఒక పిల్లవాడు అరెస్టుకావడమో లేక గాయం తగిలి ఆస్పత్రికి కొనిపోబడడమో జరుగుతూ ఉంటుంది. మనకు తెలియదు ఉమ్ఫున్ డీస్. మీరు నిరాశ చెందకండి. నేను వెదకడం మానుకోను."

ఇలా అని ఆ యువకుడు కారు నడిపించుకుపోతుంటే వారిద్దరూ చూస్తూ నిలుచున్నారు.

"అతను చాలా మంచివాడు. సరే ఇహ మనం నడుద్దాం" అన్నాడు కుమాలో.

కాని సిమాంగు అక్కడనుంచి కదల్లేదు.

"మీతో నడవడానికి నాకు సిగ్గుగా ఉంది" అన్నాడు. ఎంతో ఆపదలో చిక్కుకున్న వాడిలాగా అతని ముఖం అష్టవంకర్లు తిరిగింది.

కుమాలో అతని వంక చూచి నిర్ఘాంత పోయాడు.

"నా నోటితో ఇలా పాడు మాటలు మాట్లాడినందుకు నన్ను క్షమించండి." అన్నాడు సిమాంగు.

"అంటే వెదకడాన్ని గురించా ?"

"అయితే మీరు అర్థంచేసుకున్న ట్లేనా ?"

"ఆఁ అర్థమైంది."

"త్వరగానే అర్థం చేసుకున్నారు."

"నేను వృద్ధుణ్ణి. ఏదో శాస్త్ర చదువుకున్న వాణ్ణి. మిమ్మల్ని క్షమించాను లెండి."

"నేను మత గురువుగా వుండడానికి తగనని ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది నాకు. మీకు ఒక విషయం చెప్ప గలను..."

"మరేం ఫరవా లేదు. దుర్బల హృదయుణ్ణనీ, స్వార్థ పరుణ్ణనీ మీరే చెప్పుకున్నారు కదా. కాని ఆ ఈశ్వరుని ఆశీస్సులు మీకు ఉన్నాయి. అది నిజమేలా కనిపిస్తుంది."

"ఓ ! మీరు నాకు ప్రశాంతత చేకూరుస్తున్నారు."

"కాని మిమ్మల్ని ఒక విషయం అడగాలనుకుంటు న్నాను."

సిమాంగు అతని వంక చూచాడు. ముఖంలో ఏదో వెదుకుతున్నట్లు పరిశీలించాడు. తరువాత "అలాగే అంగీక రిస్తున్నాను" అన్నాడు.

"ఏమిటి అంగీకరించేది ?"

"అదే. మిమ్మల్ని మళ్ళీ ఆ అమ్మాయి దగ్గరికి తీసుక వెళ్ళడానికి."

"చూడబోతే మీరు తెలివైన వారిలా కనిపిస్తు న్నారు."

"ఓ! మనలో ఏ ఒకరో తెలివి కలవారైనంత మాత్రాన ప్రయోజనం లేదు."

నిజానికి వా రిరువురూ ఈ విధంగా పరాచకా లాడు కునే స్థితిలో లేరు. ఇరువురు ఆంగ్లాండ్‌లోకు వెళ్లే రోడ్డువెంట నడవసాగారు. కాళ్ళు కాలేటంత వేడిగా ఉంది రోడ్డు. ఇరు వురు మౌనం వహించారు. వారి మనసుల్లో ఎన్నో ఆలో చనలు ముసురుకుని ఉన్నాయి.

## ౧౧

వారిరువురు మళ్ళీ సోఫియాటౌన్ వెళ్ళడానికి రైలెక్కి కూచు న్నారు. అప్పుడు సిమాంగు ఇలా అన్నాడు:

"ఇహ మీరు కొంచెం విశ్రాంతి తీసుకోవాలి. ఆ విషయమే ఆలోచిస్తున్నాను నేను."

ఇది విని కుమాలో అతనివంక చూచాడు.

"నేనెలా విశ్రాంతి తీసుకోగలను?" అన్నాడు.

"మీ ఉద్దేశం ఏమిటో నాకు తెలుసును. మీ రెంతో ఆతృతతో ఉన్నారనీ నే నెరుగుదును. కాని పిల్లలజైలులో ఉన్న ఆ తెల్లజాతి యువకుడున్నాడే—అతను మీ అబ్బా యిని వెదికే విషయంలో మీకంటె, నాకంటె కూడా ఎక్కువ ఉపయోగపడతాడు. ఇవాళ మంగళవారం. రేపు లేదు, ఎల్లుండి నేను ఇజెంజెలెనీకి వెడతాను. అక్కడ అంధు లైన మనవాళ్లున్నారు. వాళ్ళచేత, ఇంకా తక్కిన మనవాళ్ళ చేత నేను పూజచేయించవలసి ఉంది. ఆ రాత్రి నే నక్కడే

పడుకొని మరుసటిరోజు తిరిగివస్తాను. మీరు నాతో వచ్చి నట్లయితే సూపరింటెండెంటుకు టెలిఫోన్ చేసి అడుగుతాను. నేను పనిచేసుకుంటున్నప్పుడు మీరు విశ్రాంతి తీసుకో వచ్చును. అది చాలా చక్కని ప్రదేశం. అక్కడొక చిన్న గుడికూడా ఉన్నది. కాలిక్రింది నేల దిగువనున్న లోయలోకి జారిపోతూ వుంటుంది. అంధులైన మనవాళ్ళకోసం తెల్ల వాళ్ళు ఎంత గొప్పపని చేస్తున్నారో చూస్తే మీరు నిజంగా పొంగిపోతారు. ఆ తరువాత మనం తిరిగివచ్చి చేయవలసిన పనులు చక్కబెట్టుకుందాం."

"అయితే నాయనా, మీరు పనిమానుకొని వస్తారా?"

"ఆ విషయం నేను నాపై అధికార్లతో మాట్లాడాను. మీ అబ్బాయి దొరికేంతవరకూ మీకు నేను సహాయం చెయ్యడానికి వారు అంగీకరించారు."

"వాళ్ళు చాలా దయకలవాళ్ళు. మంచిది, నాయనా మనం అలాగే వెళ్ళదాం."

*　　　*　　　*

ఆ సాయంత్రం మిషన్ హౌస్‌లో ఎంతో ఉల్లాసం వెల్లివిరిసింది. గులాబీ చెక్కిళ్ళుగల క్రైస్తవ మతగురువు విన్సెంట్ అక్కడే ఉన్నాడు. వారంతా కుమాలో మత గురువుగా పనిచేస్తూ నివసిస్తున్న ప్రదేశాన్ని గురించి ముచ్చ టించుకున్నారు. అదంతా విన్న తరువాత తెల్లవాడైన విన్ సెంట్ తన స్వదేశాన్ని గురించికూడా వారికి చెప్పాడు. అక్కడి పొలాలను గురించి, కంచెలను గురించి, క్రైస్తవ

మతమైన వెస్ట్‌మిన్స్టర్ ఆబేను గురించి, ఇంకా దేశంలో ఉన్న పెద్ద పెద్ద క్రైస్తవదేవాలయాలను గురించి చెప్పాడు. కాని వారిలా కులాసాగా కబుర్లాడుకోవడం ఎంతోసేపు సాగలేదు. ఒక తెల్ల మతగురువు నగరంనుంచి 'ఈవినింగ్ స్టార్' అనే వార్తాపత్రిక తీసుకుని అక్కడికి వచ్చాడు. అందులో నల్లటి పెద్దఅక్షరాలతో ఉన్న వార్త ఒకటి వారికి చూపించాడు:

పార్క్ హోల్డులో హత్య. ప్రసిద్ధుడైన నగర ఇంజనీర్‌ను కాల్చి చంపారు. ఈ దాడిచేసిన వాళ్లు స్వదేశీయులేనని భావించబడుతోంది.

"ఇది దక్షిణఆఫ్రికాకు తీరని నష్టం." అన్నాడా తెల్ల మతగురువు. "ఈ చనిపోయిన ఆర్థర్ జార్విస్ యువకుడు. ధైర్యసాహసాలు కల వ్యక్తి. న్యాయంకోసం గొప్ప పోరాటాలు సల్పినవాడు. ఇతని మరణం వల్ల చర్చికికూడా తీవ్రమైన నష్టం సంభవించింది. మన యువకు లందరి లోకీ ఇతను ఎన్నదగిన వాడు."

"జార్విసా? నిజానికిది చాలా దారుణమైన విషయం" అన్నాడు సిమాంగు: "క్లేర్‌మాంట్‌లో గ్లాడియోలస్ వీధిలో ఉన్న ఆఫ్రికన్ బాలుర క్లబ్‌కు ఇతను అధ్యక్షుడు"

"బహుశా ఇతన్ని మీరు ఎరుగుదురను కుంటాను." అన్నాడు మతగురువు విన్‌సెంట్, కుమాలోతో: "కారిన్ బ్రూక్‌లో ఉండే మిస్టర్ జేమ్సు జార్విస్‌కు ఇతను ఒక్కడే కొడుకని వింటున్నాము." అన్నాడు.

"అవును. ఇతని తండ్రిని నే నెరుగుదును." అన్నాడు కుమారాలో విచారంగా. "అంతే అతని పేరు బాగా విన్నాను. మనిషినికూడా అనేకమార్లు చూచాను. కాని మేం ఇరువురం ఎన్నడూ మాట్లాడుకోవడం తటస్థించలేదు. ఇన్‌డాటీ షేనీలో కొండలమీద ఇతని పొలం ఉన్నది. అప్పుడప్పుడు మా చర్చి ప్రక్కనుంచే వెడుతుండేవాడు. కాని ఇతని కుమారుణ్ణి నే నెరుగను."

ఇలా అని కొంచెంసేపు ఊరుకుని మళ్ళీ చెప్ప సాగాడు కుమారాలో; "అయినా చక్కగా ఉండే ఒక చిన్న కుర్రవాడు నాకు జ్ఞాపకమున్నాడు. ఆ అబ్బాయి అప్పు డప్పుడు గుర్రంమీద స్వారీచేస్తూ మా చర్చిప్రక్కనుంచే వెడుతుండేవాడు. నాకంత బాగా జ్ఞాపకం లేదుకాని ముత్తా నికి ఆ చిన్నకుర్రవాడు; మాడ ముచ్చటగా ఉండేవాడు."

ఇలా అని మళ్ళీ అతను ఊరుకున్నాడు.

"ఇది చదివి వినిపించమంటారా" అన్నాడు, మత గురువు విన్‌సెంట్.

"పార్క్ వోల్డులో ప్లాంటేషన్ రోడ్డులో ఉండే మిషర్ ఆర్థర్ జార్విస్ ఇవాళ మధ్యాహ్నం ఒకటిన్నర గంటలకు అతని ఇంట్లో కాల్చి చంపబడ్డాడు. ఇలా ఇంట్లో చొరబడి హత్య చేసినవాడు స్వదేశీయుడని భావించబడు తోంది. జార్విస్ భార్య, అతని ఇరువురు బిడ్డలు ఇంట్లో లేరు. మిస్టర్ జార్విస్ ఏమో తనకు కొంచెం జలుబుగా ఉన్నందు వల్ల ఇంట్లోనే ఉంటానని తన భాగస్థులకు టెలిఫోన్ చేసి

చెప్పాడు. ఆ తరుణంలో ఒక స్వదేశీయుడు బహుశా మరో ఇరువురుని జత చేసుకుని ఇంట్లో ఎవరూ లేరనే తలంపుతో వంటింట్లోనుంచి లోనికి ప్రవేశించాడు. వంటింట్లోఉన్న స్వదేశీయుడైన సేవకుణ్ణి వాళ్ళు కొట్టారు. అతను స్పృహ తప్పి క్రిందపడిపోయాడు. ఈ గందరగోళం విని జార్విస్ ఏమిటో తెలుసుకుందామని మేడమీదినుంచి వంటింట్లోకి వచ్చే త్రోవలోనే అతను కాల్చి చంపబడ్డాడు. ఏవిధమైన పెనుగులాట జరిగినట్లు గుర్తులు లేవు.

"ఈ విషాద సంఘటన జరగడానికి కొంచెం ముందు ప్లాంగ్టన్ రోడ్డులో స్వదేశీయులైన ముగ్గురు యువకులు తిరుగుతూఉండటం కనిపించింది. వెంటనే హత్య జరిగిన చోటుకి అపరాధపరిశోధకుల జట్టు ఒకటి పంపబడింది. తీవ్రమైన దర్యాప్తులు జరుపబడ్డాయి. పార్క్‌వోల్టు గట్టుమీద ఉన్న చెట్లు కొట్టివేశారు. స్వదేశీయుడైన సేవకుడు రిచర్డ్సు పైరింగ్ యూరోపియ నేతరులకు చెందిన ఆస్పత్రిలో స్పృహ తప్పి పడిఉన్నాడు. అతనికి కాస్త తెలివివస్తే, అతనిచ్చే వాఙ్మూలం వలన పోలీసులకు అతి ముఖ్యమైన వివరాలు కొన్ని లభించవచ్చునని భావించబడుతోంది. ఏమైనప్పటికీ అతని పరిస్థితిమాత్రం చాలా విషమంగాఉంది.

"పిస్టల్ పేల్చిన చప్పుడు ఆ ఇంటి పొరుగున ఉన్న మిస్టర్ మైఖెల్ క్లార్కు విన్నాడు. వెంటనే అతనక్కడికి వెళ్ళి ఈ విషాద సంఘటనను గుర్తించడం జరిగింది. కొద్ది నిముషాల్లోనే పోలీసులు అక్కడికి వచ్చారు. హత్య చేయ

బడిన వ్యక్తి మంచం ప్రక్కనే టేబిల్‌మీద 'స్వదేశీయుల నేరాలను గురించిన సత్యం' అనే ఒక వ్యాసం వ్రాత ప్రతి కనిపించింది. ఆ వ్యాసం ఇంకా పూర్తి కాలేదు. అతను చనిపోవడానికి ముందు ఆ వ్యాసం వ్రాసుకుంటూ కూచు న్నట్లు కనిపిస్తోంది. అతను కాలుస్తూ కాలుస్తూ పెట్టిన పైప్ టేబిల్‌మీద ఇంకా అలాగే వెచ్చగా ఉంది.

"మిస్టర్ జార్విస్‌కు భార్య, తొమ్మిదేండ్ల మగ పిల్లవాడు, అయిదేండ్ల ఆడపిల్ల ఉన్నారు. అతను నేటాలు లోని కారిస్ బ్రూక్‌లో ఉండే మిస్టర్ జేమ్సు జార్విస్ కుమారుడు. జోహానసుబర్గు నగరంలో జేవిస్‌కుచెందిన ఒక ఇంజనీరింగ్ సంస్థలో భాగస్థుడు. ఆ వ్యాపారసంస్థ 'వాన్ డెర్ వాల్ట్ అండ్ జార్విస్' అనే పేరుతో ఉన్నది. ఈ చనిపో యినవ్యక్తి సాంఘికసమస్యలపట్ల ఎంతో ఆసక్తిని చూపుతూ, ఎన్నదగిన కృషి చేస్తూ వచ్చాడు. సంఘంలో యూరోపి యనేతరుల సంక్షేమాన్ని గురించి ఎంతో పాటుపడ్డాడు."

ఈ విషయమంతా పత్రికలో చదువుకున్న తరువాత ఇహ ఇప్పుడందరూ మాట్లాడటం మానివేశారు. అందరి లోనూ మౌనం అవతరించింది. ఏ దేశంయొక్క అంద చందాలను గురించి కాని, పొలాలు, భూములను గురించి కాని మాట్లాడే వ్యవధి లేదిప్పుడు. ఈ శిక్షల వార్తలు తెలిపే పొరటలు తిరగవేసినప్పుడల్లా వారి హృదయాల్లోను, మనస్సుల్లోను దిగులు, భయం, అసహ్యం; ఇవన్నీ గూడు కట్టుకుని ఉంటాయి. విచ్ఛిన్నమైపోయిన జాతిని గురించి,

అంతరించిపోయిన ఆచారం, చట్టాన్ని గురించి వారు ఆక్రందన చేస్తారు. అప్పుడు. చనిపోయిన మనిషినిగురించీ, శోకాతురులైన అతని భార్యా బిడ్డలనుగురించీ ఆర్తనాదం చేస్తారు. ప్రియతమమైన తమ దేశంకోసం ఆక్రందన చేస్తారు. అయినప్పటికీ ఎంతకూ ఈ విషయాలకు అంతంటూ కనిపించడం లేదు. ఈ భూమిమీద—ఈ మనోహరమైన భూమిమీద సూర్యుడు ఉజ్వలంగా ప్రకాశిస్తున్నాడు. కాని మానవుడు ఆ ఆనందాన్ని అనుభవించలేక పోతున్నాడు. అతనికి తన హృదయంలో పెనవేసుకుని ఉన్న భయాన్ని గురించి మాత్రమే తెలుసును.

*　　　*　　　*

కుమాలో అక్కడనుంచి లేచాడు.

"నేను నా గదికి వెడతాను. అందరికీ నా నమస్కారం" అన్నాడు.

"నాయనా—నేనుకూడా మీ వెంట వస్తాను."

మిసెస్ డితెబే ఇంటి గేటుదాకా వారు నడిచి వెళ్ళారు. కుమాలో తన స్నేహితుని ముఖంవంక చూచాడు. అతని ముఖం బాధాపూరితమై ఉంది.

"ఈ విషయం, ఈ విషయం — ఇక్కడ నా హృదయంలో భయం తప్ప మరేమీ లేదు—భయం, భయం, భయం" అన్నాడు.

"నా కర్థమైంది. అయినా వేనవేల జనంతో నిండి ఉన్న ఈ మహానగరంలో ఈ ఒక్క విషయంకోసం భయపడటం అవివేకమైన పని."

"ఇది వివేకమా అవివేకమా అన్న ప్రశ్నకాదు. కేవలం భయం - అంతే."

"రేపు లేదు ఎల్లుండి మనం ఇజెన్ జెలెసీకి వెడతాం. బహుశా అక్కడ ఏదో ఒకటి మార్గం అగుపించవచ్చును."

"సందేహంలేదు; సందేహంలేదు. ఏదైనా—కాని నేను ఇంతగా వాంఛించేది మాత్రం కాదు."

"రండి ప్రార్థన చేద్దాం."

"నేను ప్రార్థించలేను. నాలో ఏమీ మిగల్లేదు. నా అంతరంగం మూగపోయింది. మాటలు పలకదు నాయనా"

"నమస్కారం నాయనా."

"నమస్కారం"

కుమారుల్లో మెల్లగా చిన్న క్రోవగుండా వెడుతూ ఉంటే సిమాంగు గమనిస్తూ నిలుచున్నాడు. అతను చాలా వృద్ధుడైపోయినట్లు అగుపించాడు. తరువాత సిమాంగు అక్కడనుంచి వెనక్కుతిరిగి మళ్ళీ మిషన్‌కు వెళ్ళిపోయాడు. నిజానికి, ఈ లోకంలో భగవంతుడనేవాడు లేనట్లు కనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు.

## ౧౨

నిశ్చయంగా ఈ భూమిలో భయం గూడుకట్టుకుని ఉన్నది.

అనేకమంది చట్టము, న్యాయము లేకుండా తయారైనప్పుడు మనుష్యులు ఏం చెయ్యగలరు? ఈ భూమి ఎంతో చక్కనిదైనప్పటికీ, ఈ భూమిపై సూర్యుడు ఎంతో ఉజ్వ

లంగా ప్రకాశించినప్పటికీ, ఈ భూమిమీద మానవుడు డెబ్బయి సంవత్సరాలపాటు జీవించినప్పటికీ, అతని హృదయంలో భయం పట్టుకుని పీడిస్తున్నప్పుడు ఈ ఆనందాలన్నీ ఎలా అనుభవించగలడు? వారి అందచందాలన్నీ ప్రమాదంగా మారినపుడు ఎవడైనా జకరాండా మహావృక్షచ్ఛాయల్లో నిశ్శబ్దంగా ఎలా నడవగలడు? అంధకారంలో ఏదో రహస్యం ఆవరించి ఉన్నప్పుడు ఎవడైనా తన పక్కమీద ప్రశాంతంగా ఎలా పడుకోగలడు? భయము, బెదరింపువచ్చి తమ ఏకాంతాన్ని భగ్నపరుస్తున్నప్పుడు ఏ ప్రేయసీ ప్రియులైనా మధురమైన రాత్రివేళ నక్షత్రాల చాందినీ క్రింద పరుండి ఎలా సుఖం అనుభవించగలరు?

వందలు, వేలు కంఠస్వరాలు 'ఏం చెయ్యాలి, ఏం చెయ్యాలి' అని కలవరిస్తున్నాయి, పలవరిస్తున్నాయి, శోకిస్తున్నాయి. కాని ఈ స్వరాలన్నీ ఒకటి ఇవని, ఒకటి అదని మరొకటి ఇంకేదో అని—చివరకు ఇదీ అదీ ఏదీ కాకుండా ఆక్రందన చేస్తున్నప్పుడు ఏ సలహా కాని సహాయం కాని ఎలా లభిస్తాయి?

*           *           *

నాయనలారా, అమ్మలారా! ఈ ఆక్రందన చాలా అపఖ్యాతి కలిగించేది. మాకుగల పోలీసు సహాయం బహు స్వల్పం. ఈ పొలిమేర ప్రాంతం జోహానసుబర్గులోని తక్కిన చాలా పొలిమేర ప్రాంతాలకంటె ఎక్కువ పన్నులు చెల్లిస్తుంది. కాని ఇందుకు ప్రతిఫలంగా మాకేం లభిస్తున్నది? మాకున్నది ఒక్క పోలీసుస్టేషన్. అదీ మూడవతరగతికి చెంది

సది. ఆ స్త్రీ తిరగడానికి ఒక్క పోలీసు, టెలిఫోన్ దగ్గర ఒక్క పోలీసు; మొత్తం ఇద్దరితో సరిపోతుంది. గత ఆరుమాసాల్లోనూ ఇలాంటి దౌర్జన్యం జరగడం ఇది రెండవసారి. మాకింకా ఎక్కువ రక్షణ అవసరమని అడగవలసి ఉంది.

(హర్ష ధ్వానాలు)

మిస్టర్ క్లేరెన్స్! మీ తీర్మానాన్ని మాకు చదివి వినిపిస్తారా ?

*　　　*　　　*

మన దేశంలోని ఆదిమవాసులకు ఉద్వేగ్నపరిచే ఉదాత్తమైన యోచనలు, గమ్యస్థానాన్ని చేర్చే ఉత్తమమైన కార్యాలు ఉంటే తప్ప, అంతవరకూ మనం ఈ ఆదిమవాసుల నేరాలను గురించి భయపడుతూ ఉండవలసిందే. వారికిలాంటి యోచనకాని, గమ్యస్థానంకాని లేనందువల్ల నే వారు త్రాగుబోతులవుతున్నారు, నేరస్థులవుతున్నారు, వ్యభిచారు లవుతున్నారు. మరి మనం ఎవర్ని ఎంచుకుంటాం ?— చట్టానికి బద్ధులై ప్రయోజనాన్ని ఆశించి పరిశ్రమించే ఆదిమవాసులనా ? లేక చట్టాన్ని ధిక్కరించి ప్రయోజనం లేకుండాను, సోమరులుగాను తిరిగే జనాన్నా ? ఎవరిని ? నిజానికి మనకీ విషయం తెలీదు. ఎందుచేతనంటే మనం ఈ ఉభయులకు కూడా భయపడుతున్నాం. మనం ఇలా రెంటిమధ్య ఊగిసలాడుతున్నంత వరకు అనిశ్చయమైన ఆనందంకోసం ప్రాకులాడుతున్నంతవరకూ మన మనస్సులు కుదుటపడవు. ఇంకా ఎక్కువమంది పోలీసులు, ఇంకా ఎక్కువ రక్షణ కావా